# విద్యార్థి వ్యాకరణము

జి. వెంకటేశ్వర్లు

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.

Vidyardhi Vyakaranamu - G. Venkateswarlu

ప్రచురణ నెం. : 2350/2325 R

కాపీలు : 1000

ప్రథమ ముద్రణ : డిసెంబర్, 1993
చతుర్థ ముద్రణ : జూలై, 2002
పంచమ ముద్రణ : ఫిబ్రవరి, 2004

టైటిల్ డిజైన్ : రాజా



వెల: రూ.30-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్
(సుల్తాన్‌బజార్-అబిడ్స్)-హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్నం, అనంతపురం,
తిరుపతి, హన్మకొండ, కాకినాడ, గుంటూరు.



ముద్రణ: విశాలాంధ్ర ప్రెస్, హైదరాబాదు-20.

# అంకితం

మాన్యశ్రీ RTN; PAF,

**శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి**

మహోదయులకు

(ప్రెసిడెంట్ అండ్ కరస్పాండెంట్ ఆఫ్

పైండా ఎడ్యుకేషనల్

ఇన్స్టిట్యూషన్స్)

# విషయసూచిక

# వ్యాకరణము

## ముఖ్య వ్యాకరణ సంజ్ఞలు

1. ఉభయాక్షరములు: అచ్చుల యొక్కయు, హల్లుల యొక్కయు లక్షణములు గలిగి వానితోడ పలుకబడునవి.
   ఉదా॥ ం, ఁ, ః – పూర్ణ బిందువు, అర్ధ బిందువు, విసర్గ. ఇవి స్వయముగా పలుకబడవు.
2. వక్రములు: వంకరగా ఉచ్చరింపబడునవి.
   ఉదా॥ ఎ, ఏ, ఒ, ఓ.
3. వక్రతమములు: మిక్కిలి వంకరగా ఉచ్చరింపబడునవి.
   ఉదా॥ ఐ, ఔ.
4. కంఠ్యములు: కంఠముయొక్క సహాయముతో నుచ్చరింపబడునవి.
   ఉదా॥ క, ఖ, గ, ఘ, ఙ.
5. తాలవ్యములు: తాలువుల (దవడలు) సహాయముతో పలుకబడునవి.
   ఉదా॥ చ, ఛ, జ, ఝ, ఞ.
6. దంత్యములు: దంతములతో పలుకబడునవి.
   ఉదా॥ త, థ, ద, ధ, న.
7. మూర్ధన్యములు: మూర్ధమును నాలుక తాకుటచే ఉచ్చరింపబడు వర్ణములు.
   ఉదా॥ ట, ఠ, డ, ఢ, ణ.
8. ఓష్ఠ్యములు: ఓష్ఠము (పెదవులు) సహాయముతో పలుకబడునవి.
   ఉదా॥ ప, ఫ, బ, భ, మ.
9. అనునాసికములు: నాసిక (ముక్కు)ను అనుసరించి పలుకబడునవి.
   ఉదా ॥ ఙ, ఞ, ణ, న, మ.

10. అంతస్థములు: స్పర్శాక్షరములకును, ఊష్మాక్షరములకును నడుమ నుండునవి.

ఉదా॥ య, ర, ల, వ.

11. ఊష్మములు: గాలి యూదుటచే పలుకబడు వర్ణములు.

ఉదా॥ శ, ష, స, హ.

12. పరుషములు: కఠినముగ నుచ్చరింపబడునవి.

ఉదా॥ క, చ, ట, త, ప.

13. సరళములు: తేలికగ నుచ్చరింపబడునవి.

ఉదా॥ గ, జ, డ, ద, బ.

14. స్థిరములు: సాధారణముగా వ్యాకరణ కార్యములవలన మార్పుచెందక స్థిరముగ నుండు వర్ణములు. పరుష సరళములు కానివి.

ఉదా॥ ఖ, ఘ, ఛ, ఝ, ఞ, ఠ, ఢ, ణ, థ, ధ, న, ఫ, భ, మ, య, ర, ల, వ, శ, ష, స, హ, ళ.

15. వర్గ యుక్కులు: వర్గమునందలి రెండవ, నాల్గవ అక్షరములు. వీనినే మహాప్రాణములందురు.

ఉదా॥ ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ.

16. ద్రుతము: నకారము ద్రుతము. ఇది పొల్లు నకారముగ (న్) కూడ నుండవచ్చును. ప్రత్యయ, ఆగమ, అవ్యయాత్మకమైన ఉత్వవిశిష్టనకారము ద్రుతసంజ్ఞ గలదియే అగు(ను). ద్రుతమనగా జారిపోవునదని యర్థము. ఇది పదము చివర యుందుండి, మార్పు చెందినను, లోపించినను అర్థభంగము కాదు.

17. ద్రుత ప్రకృతికములు: ద్రుతమంతమందు గల శబ్దములు.

ఉదా॥ పలికెన్, వానిని.

18. కళలు: ద్రుత ప్రకృతికములు కానివి కళలు. అనగా ద్రుతము చివర లేని పదములు.

ఉదా॥ రాముడు, గోడ, యిల్లు, చెట్టు, నాయొక్క.

19. వర్ణకము: అనగా ప్రత్యయము.

ఉదా॥ డు, ము, వు, యొక్క, లోపల మొ॥

20. వర్ణము: అనగా అక్షరము.

ఉదా॥ అ, క, ఘ, హ, మొ॥

21. నామవాచకములు: ఇంద్రియములకు గాని, మనస్సునకుగాని గోచరములగు పదార్థముల నామములు. వీనినే విశేష్యములు అందురు.

ఉదా॥ రాముడు, సీత, విజ్ఞానము, గ్రంథము.

22. సర్వనామములు: నామవాచకమునకు బదులుగా వాడబడునవి.

ఉదా॥ అతడు, ఆమె, అది, వారు, వాడు.

23. విశేషణములు: విశేష్యములయు లేక నామవాచకములయు, సర్వనామములయు గుణములను తెలియజేయునవి.

ఉదా॥ చల్లని గాలి, తియ్యని పండు.

ఎ) క్రియావిశేషణములు: క్రియయొక్క గుణమును తెలియజేయును.

ఉదా॥ మెల్లగ వీచును, కమ్మగ పాడెను.

బి) క్రియాజన్య విశేషణములు: క్రియల నుండి పుట్టిన విశేషణములు. వీనినే ధాతుజ విశేషణములనియు అందురు.

ఉదా॥ ఉదయించుచున్న చంద్రుడు, వికసించుచున్న కలువలు

24. సముచ్ఛయము: వాక్యమునందు ఒకే క్రియతో నన్వయించు పదములను కలుపువానికి సముచ్ఛయములని పేరు.

ఉదా॥ యు, ను.

సీతయు, రాధయును పాడుచుండిరి.

25. అసమాపక క్రియ: కార్యము లేక పని పూర్తిగా ముగియకుండినట్లు చెప్పు క్రియ.

ఉదా॥ కొంగ నీట నిలిచి జపము చేయుచుండెను. తుమ్మెద మకరందమును గ్రోలి ఝుంకారము చేయుచుండెను.

26. క్త్వార్థకములు: భూతకాలిక అసమాపక క్రియలు ఏకాశ్రయములయిన క్రియలలో ముందు జరిగిన కార్యమును దెలుపు క్రియయే ఇది. ధాతువునకు 'ఇ' అను ప్రత్యయమును చేర్చుటవలన నీ క్రియ యేర్పడును.

ఉదా॥ చూచి, చేసి, పోయి.

27. వ్యతిరేక క్త్వార్థకములు: వ్యతిరేకార్థమును తెలుపు భూతకాలిక అసమాపక క్రియకు వ్యతిరేక క్త్వార్థకమని, అనగా క్త్వార్థకమునకు

వ్యతిరేకార్థమును నిచ్చు అసమాపక క్రియ. ఇందు ధాతువునకు 'అక' ప్రత్యయము చేరును.

ఉదా॥ చూడక, చేయక, చెప్పక, పోవక.

28. శత్రర్థకము: వర్తమానార్థమును దెల్పు అసమాపక క్రియకు శత్రర్థకమని పేరు. ఇందు ధాతువునకు 'చున్ 'అను ప్రత్యయము చేరును.

ఉదా॥ చూచు+చున్=చూచుచున్, చేయుచున్.

29. ఆత్మనేపదము: క్రియాపదము కర్తకు చెందునట్లు తెలుపుక్రియ. పనిచేయువాడు ఎవడో దాని ఫలము ననుభవించువాడు అతడే అనగా కర్తయే అగును. ఇందు ధాతువునకు 'కొను' ప్రత్యయము చేరును.

ఉదా॥ ఆమె వండుకొనెను (ఆమె తనకొఱకే వంట వండెనని అర్థము.)

అతడు చదువుకొనెను (అతడు తనకొఱకే చదువుకొనెను.)

30. పరస్మై పదము: క్రియాఫలము కర్తకు గాక ఇతరులకు చెందుటను తెలుపు క్రియ.

ఉదా॥ ఆమె వండెను (ఆమె తన కొఱకేగాక మరొకరికొరకు కూడ వండెనని భావము.) అతడు వ్రాసెను. (అతడు తన కొఱకేగాక మరొకరి కొఱకైనను వ్రాసియుండెనని భావము.)

31. ఆమ్రేడితము: ద్విరుక్తము యొక్క పరరూపము ఆమ్రేడితము. ఒక పదము రెండు మారులు ఉచ్చరింపబడిన అందు రెండవమారు ఉచ్చరింపబడిన దానిని ఆమ్రేడిత మందురు.

ఉదా॥ ఔర + ఔర = ఔరౌర. ఇందు రెండవసారి వచ్చిన 'ఔర' ఆమ్రేడితము. ఇందు ఆమ్రేడితము వచ్చినది గాన దీనిని ఆమ్రేడిత సంధి అందురు.

32. శబ్ద పల్లవములు: ధాతువులకు, నామవాచకములకు ధాతువులు అనుప్రయుక్తములయి విశేషమైన లేక ప్రత్యేకమైన అర్థమునిచ్చిన ఆ పదములను శబ్ద పల్లవము లందురు.

ఉదా॥ కూరుచు+ఉండు>కూరుచుండు (ధాతువుపై ధాతువు)
ఆకలి+కొను (కలిలోపము)>ఆకొను (నామముపై ధాతువు)
అలవు+పడు>అలవడు (అభ్యాసమగు).

33. **ఔప విభక్తికములు:** విభక్తి నిమిత్తములై కొన్ని శబ్దములకు ద్వితీయాది విభక్తులు పరమగునపుడు అగములుగను, ఆదేశములుగను వచ్చు ఇ, టి, తి, వర్ణములు ఔపవిభక్తికములు. విభక్తికి సమీపమున నుండుటచే నివి ఔపవిభక్తికములైనవి.

'ఇ' – ఊరు + ని ద్వితీయ > ఊరిని.
'టి' – ఏఱు + టి + లో షష్ఠి > ఏటిలో
'ంటి' – పన్ను + ంటి + చేత > పంటిచేత
'తి' – నేయి + తి + కిన్ > నేతికిన్.

34. **తద్ధర్మార్థకము:** తన ధర్మమును తెలుపు క్రియలు.

ఇవి భూతకాలము, భవిష్యత్కాలము, వర్తమాన కాలము అను మూడు కాలములందు వర్తించును.

ఉదా॥ సూర్యుడు తూర్పున ఉదయించును.

సూర్యుడు ఏ కాలమునందైనను తూర్పుననే ఉదయించును. ఇది సూర్యుని (దానియొక్క) సహజ ధర్మము.

35. **నిత్యైక వచనము:** ఎల్లప్పుడును ఏకవచన మందే ప్రయోగింపబడును. వీనికి బహువచన ముండదు.

ఉదా॥ వరి, బియ్యము, వెండి, బంగారము, సాటి, నూనె, తెలుపు, నలుపు ఇత్యాదులు.

36. **నిత్య బహువచనము:** ఎల్లప్పుడు బహు వచనమునందే ప్రయోగింప బడును. ఏకవచన రూప ముండదు.

ఉదా॥ వడ్లు, పెసలు, కందులు, పాలు, అందఱు, ఇరులు, కురులు ఇత్యాదులు.

37. **ప్రథమ పురుష:** ఎచ్చటనో ఉన్న వ్యక్తిని తెలుపును. ఇతరులకు మారుగా వచ్చు సర్వనామములు, వానిని గురించి తెలుపు క్రియలు ప్రథమ పురుష అందురు.

ఉదా॥ వాడు పాడెను, అమె ఆడెను, అది చూచెను.

38. **మధ్యమ పురుష:** ఎదుట నున్న వానికి మారుగా వచ్చు సర్వనామములు, వానిని గురించి తెలుపు క్రియలు మధ్యమ పురుష యగును.

ఉదా॥ నీవు వింటివి, మీరు చూచెదరు.

39. **ఉత్తమ పురుష:** తనకు మారుగా వచ్చు సర్వనామము. తనను గురించి తెలిపెడి క్రియ ఉత్తమ పురుష యగును.

ఉదా॥ నేను వ్రాసితిని. మేము చదువుదుము.

40. **ప్రాతిపదికము:** ఏవిధమైన ప్రత్యయముగాని ప్రత్యయాంతముగాని, ధాతువుగాని లేని, అనగా అవి చేరని అర్థవంతమైన శబ్దము.

ఉదా॥ రామ, శంభు, హరి.

41. **తత్సమములు:** సంస్కృత ప్రాకృత శబ్దములతో సమానములైన శబ్దములు. సంస్కృత ప్రాకృత పదములకు చివర విభక్తి ప్రత్యయములను చేర్చుట వలన నివి ఏర్పడును.

ఉదా॥ రాముడు, వృక్షము, ధేనువు.

42. **తద్భవము:** సంస్కృత ప్రాకృత భవమైన శబ్దములు. అనగా సంస్కృత ప్రాకృత శబ్దముల నుండి పుట్టినవి. ఇవియే వికృత పదములు. వర్ణలోప, వర్ణాగమ, వర్ణ వ్యత్యయముచే నివి ఏర్పడును.

| | | | |
|---|---|---|---|
| వర్ణలోపము | – | తామరసమ్ (సం) | తామర (తద్భ) |
| వర్ణాగమము | – | ఆకాశః | ఆకసము. |
| వర్ణవ్యత్యయము | – | శుచి | చిచ్చు. |

43. **దేశ్యము:** త్రిలింగ దేశవ్యవహారసిద్ధంబైన భాష. తెలుగు దేశమున పుట్టి తెలుగు ప్రజలచే వ్యవహరింపబడు అచ్చ తెలుగు లేక అచ్చిక పదములకు దేశ్యములని పేరు.

ఉదా॥ ఊరు, కోట, తల్లి, అక్క, పంట, ఆవు.

44. **గ్రామ్యము:** వ్యాకరణ విరుద్ధమగు భాష గ్రామ్యము. పామరజనులచే వ్యవహరింపబడునది.

ఉదా॥ వస్తాడు, తెస్తాడు, ఇస్తాడు, వచ్చేవాడు, తెచ్చేవి, చెప్పేవి.

45. **అనింద్య గ్రామ్యము:** పెద్దలు వ్యవహరించిన భాష గ్రామ్యమైనను అది గ్రహింపదగినది. అటువంటి గ్రామ్య పదములు అనింద్య గ్రామ్యము లనబడును. నిందింపబడని గ్రామ్యపదములని అర్థము.

ఉదా॥ కలికంఠుడు, జీవగఱ్ఱ, దినవెచ్చము.

ఇట కంఠ, జీవ, దిన అనునవి సంస్కృత పదములు. కలి, గఱ్ఱ, వెచ్చము అనునవి అచ్చిక పదములు. కావున నివి వైరి సమాసములైనవి. అయినను నన్నయాది మహాకవులు వాడుటచే స్వీకరింపవలెను.

46. **అన్యదేశ్యములు:** తెలుగు భాషలో కలిసిపోయి వ్యవహారమునందున్న ఇతర దేశ భాషాపదములు.

ఇంగ్లీషు – రోడ్డు, పెన్ను, ఆఫీసు, రేడియో, కార్డు. హిందీ – తమాషా, మజిలీ, భోగట్టా.

47. **ధాతువు:** ఎటువంటి ప్రత్యయములు చేరని క్రియలయొక్క మూలరూపము.

ఉదా॥ వచ్చు, తిను, వ్రాయు, పోవు, చదువు.

48. **సమాసము:** సమర్థవంతములగు పదములు ఏకార్థీ భావమును పొందుట. వేరు వేరు అర్థములు గల అనేక పదములు కలిసి ఒకే అర్థము నిచ్చునట్టి ఒకేపదముగా ఏర్పడిన దానిని సమాసమందురు.

ఉదా॥ నల్లకలువ, తెల్లగొడుగు, ముల్లోకములు, తల్లిదండ్రులు.

49. **సంధి:** పూర్వాపరస్వరములకు పరస్వరము ఏకాదేశమగుట. రెండు అర్థవంతములైన పదములు కలియునపుడు మొదటిపదము యొక్క చివరి అచ్చునకు రెండవ పదముయొక్క మొదటి అచ్చునకు రెండింటికీ కలిపి రెండవ పదముయొక్క మొదటి అచ్చు స్థిరముగ నిలుచును.
కృష్ణుడు + ఏగుదెంచెను>కృష్ణుడేగుదెంచెను.
శివ + ఆలయము >శివాలయము.

50. **ఆగమము:** వర్ణాధిక్యము. వ్యాకరణ కార్యము చేయునపుడు రెండు పదములకు సంధి కలుగుచోట ఉన్న వర్ణములకు తోడుగా మరియొక వర్ణము మిత్రునివలె వచ్చి ప్రక్కనచేరుట.
**రుగాగమము:** ముద్ద + ఆలు >ముద్దరాలు.
**టుగాగమము:** కఱకు + అమ్ము>కఱకుటమ్ము.

51. **ఆదేశము:** స్థానాక్రమణము. వ్యాకరణకార్యమునందు రెండు పదములకు సంధి అగునెడ ఉన్న వర్ణములను తొలగించి వాని స్థానమున వేరొక వర్ణము శత్రువువలె వచ్చి చేరుట.

ఉదా॥ పూచెను + కలువలు > పూచెను గలువలు. 'క' వర్ణస్థానమున దానిని తొలగించి 'గ' వర్ణము వచ్చి జేరినది. (ద్రుతప్రకృతిక సంధి)

అన్న + తమ్ములు > అన్నదమ్ములు 'త' వర్ణస్థానమున 'ద' వర్ణము వచ్చినది. (గసడదవాదేశము)

52. **బహుళము:** బహుళమనగా నాల్గువిధములగు సంధి. అవి– నిత్యము, నిషేధము, వైకల్పికము, అన్యవిధము. ఈ నాల్గింటిలో ఏ రెండు విధములగు రూపములను పొందినను దానిని బహుళమందురు.

అత్తునకు సంధి బహుళంబుగా నగు.

మేన + అత్త >మేనత్త, మేనయత్త (వైకల్పికము)

క్రిందు + కడుపు>క్రేఁగడుపు (అన్యవిధము)

సీత + అమ్మ >సీతమ్మ (నిత్యము)

అమ్మ + ఇచ్చెను>అమ్మ యిచ్చెను (నిషేధము)

53. **వైకల్పికము:** రెండు పదములు కలియునపుడు వానికి సంధి చేసియైనను, చేయకుండగానైనను వ్యవహరించుటకు వీలగుదానిని వైకల్పికమందురు. రెండు రూపకములు వచ్చును.

ఉదా॥ మేన+అత్త = మేనత్త (సంధియైనది)

మేన+అత్త = మేనయత్త సంధి కాలేదు, యడాగమమైనది.

పుట్టిన+ఇల్లు = పుట్టినిల్లు(సంధియైనది)

పుట్టిన+ఇల్లు = పుట్టిన యిల్లు (సంధి కాలేదు).

54. **స్త్రీసమములు:** ప్రథమావిభక్తి ఏకవచన ప్రత్యయములైన డు, ము, వులు చివర చేరనట్టివియు; స్త్రీ జాతిని తెలుపనట్టివియు అచ్చిక పదములకు స్త్రీసమములని పేరు.

ఉదా॥ గోడ, బల్ల, అన్న, దూత, కాకి.

55. **నిత్యము:** రెండు పదములు ఒకదాని ప్రక్క మరొకటి వరుసగా నున్నచో, వానికి తప్పక సంధి చేయవలసివచ్చినచో దానిని నిత్యమందురు.

ఉత్తునకు అచ్చు పరమగునపుడు సంధి నిత్యము.

ఉదా॥ రాముడు + అతడు = రాముడతడు.

56. **సంశ్లేషము:** మీది హల్లుతో కూడుకొనుట. ఒక హల్లు దాని పక్కనున్న మరియొక హల్లుతో కూడుట.

ఉదా॥ పూచెను + కలువలు = పూచెన్గలువలు

నలు + కడలు = నల్గడలు

57. **స్వత్వము:** ద్రుతమునకు ప్రకృతిభావము ఉండుట.

ఉదా॥ పూచెను + కలువలు = పూచెనుగలువలు.

ఇట ద్రుతము అటులనే నిలిచియున్నది. బిందు సంశ్లేషలు రాలేదు.

58. **ఉపథ:** తుది వర్ణమునకు ముందు వర్ణము ఉపథ. ఒక పదమునందలి చివరనున్న వర్ణమునకు లేక అచ్చునకు ముందుగానున్న హల్లునకు ఉపథ అని పేరు.

బాల = బాల్ + అ – ఇందు చివరి వర్ణము అకారము. అకారమునకు ముందున్న వర్ణము లకారము. ఈ లకారమునకు ఉపథ అని పేరు.

59. **కృదంతములు:** కృత్తులు అంతమందుగలవి కృదంతములు. కృత్తులనగా ధాతువులకు విధింపబడు 'డుజ్' భిన్న ప్రత్యయములు. అనగా నామవాచకములను ఏర్పరచుట కొఱకై ధాతువులపై చేరు క, ఇమి, త, ట, కువ మొదలగు ప్రత్యయములకు కృత్తులని పేరు. ఇవి అంతమందుగలవి కృదంతములు.

ఉదా॥ మొలుచు + క = మొలక

కలుగు + ఇమి = కలిమి

పోయు + త = పోత

ఆడు + ట = ఆట.

60. **తద్ధితాంతములు:** విభక్తితో అంతమగు శబ్దములమీద భావార్థము నందు, మతుబదార్థమునందును ప్రయోగింపబడు ప్రత్యయములు తద్ధతములు. ఈ తద్ధితముల అంతమందుగలవి తద్ధితాంతములు. అనగా నామవాచకములకు, విశేషణములకు అర్థ విశేషమందు ప్రయోగింపబడు ఇమి, తనము, ఱికము మున్నగు ప్రత్యయములకు తద్ధితములని పేరు. ఇవి అంతమందుగల శబ్దములు తద్ధితాంతములు.

ఉదా॥ కూరు + ఇమి = కూరిమి

అల్లరి + తనము = అల్లరితనము

చిన్న + ఱికము = చిన్నఱికము.

61. **ఇక్కులు:** ఇ, ఉ, ఋ, ౡ అను వర్ణములకు ఇక్కులని పేరు.

62. **యణ్ణులు:** య, వ, ర, ల అను వర్ణములకు యణ్ణులని పేరు. యణ్ణులు ఆదేశముగావచ్చు సంధికి యణాదేశ సంధి అని పేరు.

ఉదా॥ అతి + ఉగ్రము = అత్యుగ్రము
గురు + ఆజ్ఞ = గుర్వాజ్ఞ
పితృ + ఆజ్ఞ = పిత్రాజ్ఞ

63. **త్రికము:** ఆ, ఈ, ఏ అను ఈ మూడు సర్వనామములు త్రికము లనబడును. త్రికములు పూర్వమందున్న సంధికి త్రికసంధి అని పేరు.

ఉదా॥ ఆ + వనిత = అవ్వనిత;
ఈ + వనము = ఇవ్వనము;
ఏ + చోటు = ఎచ్చోటు

64. **గుణములు:** ఏ, ఓ, అర్ లు గుణములు. ఈ గుణము పరమందు వచ్చు సంధికి గుణసంధి అని పేరు.

ఉదా॥ ఉప+ఇంద్ర = ఉపేంద్ర. అ+ఇ = ఏ
గంగా+ఉదకము = గంగోదకము. అ+ఉ = ఓ.
కృష్ణ+ఋద్ధిః = కృష్ణర్ధిః అ+ఋ = అర్.

65. **వృద్ధులు:** ఐ, ఔ లు వృద్ధులనబడును. వృద్ధులు ఆదేశముగా వచ్చు సంధికి వృద్ధిసంధి అని పేరు.

ఉదా॥ గంగ+ఓఘము = గంగౌఘము. అ+ఓ = ఔ
దేవ+ఐశ్వర్యము = దేవైశ్వర్యము. అ+ఐ = ఐ
కృష్ణ+ఔత్కంఠ్యమ్ = కృష్ణౌత్కంఠ్యమ్. అ+ఔ = ఔ
కృష్ణ+ఏకత్వము = కృష్ణైకత్వమ్. అ+ఏ = ఐ.

66. **సవర్ణములు:** అనగా సమానమైన వర్ణములు. అకారమునకు అకారమును, ఇకారమునకు ఇకారమును, ఉకారమునకు ఉకారమును, ఋకారమునకు ఋకారమును సవర్ణములు. ఈ సవర్ణములు ఆదేశముగా వచ్చు సంధి సవర్ణదీర్ఘ సంధి.

ఉదా॥ దైత్య+అరి = దైత్యారి. అ+అ = ఆ
శ్రీ+ఈశః = శ్రీశః. ఈ+ఈ = ఈ
విష్ణు+ఉదయః = విష్ణూదయః. ఉ+ఉ = ఊ
హోతృ+ఋకారః = హోతౄకారః. ఋ+ఋ = ౠ

67. కారకము: క్రియాన్వయము కారకము. ఒక వాక్యము నందలి పదములకు ఆ వాక్యమునందలి క్రియతోగల సంబంధమును దెల్పు దానిని కారకమందురు. కారక మన విభక్తి అని అర్థము వచ్చును. కారకము ఆరు విధములు.

ఉదా॥ కర్తృకారకము – రాముడు రావణుని జంపెను.
కర్మకారకము – రావణుడు రామునిచే చంపబడెను.
కరణకారకము – ధనముచేత సౌఖ్యము కలుగును.
సంప్రదానము – రాముని కొఱకు సీత నిచ్చెను.
అపాదానము – చోరునివలన భయపడెను.
అధికరణము – ఘటమందు జలమున్నది.

★ ★ ★

# సంస్కృత సంధులు

సంస్కృత పదములు ఒకదాని ప్రక్కన మరొకటి చేరుటచే ఏర్పడు సంధులు సంస్కృత సంధులు.

## 1. సవర్ణదీర్ఘసంధి:

**సూ॥** అ, ఇ, ఉ, ఋలకు సవర్ణములైన అచ్చులు పరమగునపుడు సవర్ణదీర్ఘము ఏకాదేశ మగును.

**వివరణము:** సవర్ణ మనగా సజాతివర్ణము లేక సమానమైన వర్ణము. అ, ఇ, ఉ, ఋ, అను వర్ణములకు ఆయా సజాతి వర్ణములు లేక అచ్చులు పరమైనచో ఆ సజాతివర్ణము యొక్క దీర్ఘము ఏకాదేశ మగును. అ, ఆ లు సవర్ణములు. ఇ, ఈ లు సవర్ణములు. ఉ, ఊ లు సవర్ణములు. ఋ, ౠ లు సవర్ణములు. ఈ జంటలయందలి అక్షరములు ఒకదాని కొకటి సవర్ణములగును. ఒకే తావున పుట్టి ఒకే ప్రయత్నముతో ఉచ్చరింపబడు వర్ణములు సవర్ణములు.

అ, ఇ, ఉ, ఋ లు అనుటచే వాని దీర్ఘములు కూడ గ్రహింపవలెను. అనగా అ వర్ణమునకు అ, ఆ లు సవర్ణములు. అదే విధముగా ఇ వర్ణమునకు ఇ, ఈ లు సవర్ణములు. అకారమునకు ఇకారమును, ఇకారమునకు ఉకారమును అసవర్ణములు.

ఈ సంధిని గుర్తించు విధము:

1. సంధి చేయబడు పదములు రెండును సంస్కృత పదములై ఉండవలెను.
2. పూర్వ పదము చివర ఏ అచ్చు ఉండునో ఉత్తర పదము మొదట కూడ అదే అచ్చు ఉండవలెను.
3. సంధి కలిపినపుడు దీర్ఘము రావలెను.

ఆదేశమునకు, ఏకాదేశమునకు గల భేదమును గమనించుట ముఖ్యము. ఆదేశమనగా ఉన్న వర్ణములను తొలగించి మరియొక వర్ణము క్రొత్తగా వచ్చి చేరుట.

ఉదా॥ పూచెను + కలువలు = పూచెను గలువలు

ఏకాదేశమనగా రెండు వర్ణముల స్థానమున ఒకే వర్ణము వచ్చి నిలుచుట. ఇట సవర్ణదీర్ఘము ఏకాదేశమగును గాన నిది సవర్ణదీర్ఘ సంధియైనది.

ఈ సంధిని నాల్గు విధములుగా విభజించవచ్చును.

**అకారం:**

అ+అ = ఆ భిక్ష+అర్థము = భిక్షార్థము
అ+ఆ = ఆ రామ+ఆలయము = రామాలయము
ఆ+అ = ఆ రమా+అంశము = రమాంశము
ఆ+ఆ = ఆ మహా+ఆనందము = మహానందము

**ఇకారము:**

ఇ+ఇ = ఈ హరి+ఇంద్రము = హరీంద్రము
ఇ+ఈ = ఈ కవి+ఈశ్వరుడు = కవీశ్వరుడు
ఈ+ఈ = ఈ శ్రీ+ఈశః = శ్రీశః
ఈ+ఇ = ఈ మహీ+ఇంద్రుడు = మహీంద్రుడు

**ఉకారము:**

ఉ+ఉ = ఊ విష్ణు+ఉదయము = విష్ణూదయము
ఉ+ఊ = ఊ ధేను+ఊధస్యము = ధేనూధ్యసము (ఆవుపాలు)
సింధు+ఊర్మి = సింధూర్మి
ఊ+ఉ = ఊ వధూ+ఉత్తమము = వధూత్తమము
ఊ+ఊ = ఊ వధూ+ఊర్మిక = వధూర్మిక

**ఋకారము:**

ఋ+ఋ = ౠ హోతృ+ఋకారము = హోతౄకారము
పితృ+ఋణము = పితౄణము.
మిగిలినవాని కుదాహరణములు అరుదుగా దొరుకును.

**సవర్ణదీర్ఘసంధి:**

అ–అ, ఆ →రామాలయము
ఈ–ఇ, ఈ →మహీంద్రుడు
ఉ–ఉ, ఉ →భానూదయము
ఋ–ౠ, ఋ→పితౄణము

## 2. గుణసంధి:

**సూ॥** అకారమునకు ఇ, ఉ, ఋ లు పరమగునపుడు పూర్వ పరస్వరములు రెంటికి ఏ, ఓ, అర్ లు ఏకాదేశమగును.

**వివరణము:** ఏ, ఓ, అర్ లకు గుణములని పేరు. గుణవర్ణములు ఏకాదేశముగా వచ్చు సంధిగాన దీనికి గుణసంధి అని పేరు.

ఇందు మొదటి పదము చివర తప్పక అకారము ఉండితీరవలెను. రెండవ పదము మొదట ఇకారము ఉన్నచో 'ఏ' కారము వచ్చును. 'ఉ' కారముండిన 'ఓ' కారము వచ్చును. ఋకారముండిన 'అర్', 'ఌ' కారముండిన 'అల్' వచ్చును. అనగా అకారమునకు ఇ, ఉ, ఋ వర్ణములే గాక ఌ వర్ణము పరమైనను దాని గుణమగు 'అర్' వచ్చును. కాని, ఈ సంధి పదములు విరళముగ కన్పించును.

అ, ఇ, ఉ, ఋ అని తెలుపుటచే వాని హ్రస్వములతోపాటు దీర్ఘములను గ్రహింపవలెను. అనగా ఇ, ఈ లకు గుణము 'ఏ ', ఉ, ఊ లకు గుణము 'ఓ', ఋ, ౠ లకు గుణము 'అర్.'

**ఏకారము:**

అ+ఇ = ఏ ఉప+ఇంద్ర = ఉపేంద్ర
అ+ఈ = ఏ పరమ+ఈశ్వరుడు = పరమేశ్వరుడు
ఆ+ఇ = ఏ భార్యా+ఇషణము = భార్యేషణము
ఆ+ఈ = ఏ మహా+ఈశ్వరి = మహేశ్వరి

**ఓకారము:**

అ+ఉ = ఓ నవ+ఉదయము = నవోదయము
అ+ఊ = ఓ అభినవ+ఊర్వశి = అభినవోర్వశి
ఆ+ఉ = ఓ మహా+ఉదధి = మహోదధి
ఆ+ఉ = ఓ గంగా+ఉదకము = గంగోదకము
ఆ+ఊ = ఓ మహా+ఉర్మ్మలు = మహోర్మ్మలు (పెద్ద అలలు)

**'అర్':**

అ+ఋ =అర్ దేవ+ఋషి = దేవర్షి
వసంత+ఋతువు = వసంతర్తువు
ఆ+ఋ = అర్ మహా+ఋషి = మహర్షి
ౠ వర్ణము ఆదిగాగల పదములు అలభ్యములు.

అ+ఇ = ఏ = దేవేంద్రుడు
అ+ఉ = ఓ = నవోదయము
అ+ఋ = అర్ = బ్రహ్మర్షి

## 3. వృద్ధిసంధి:

సూ॥ అకారమునకు ఏ, ఐ లు పరమైనచో పూర్వపదములకు ఐకారము, ఓ, ఔ లు పరమైనచో ఔ కారమును ఏకాదేశములగును.

**వివరణము:** ఐ, ఔ అను వర్ణములు రెంటికి వృద్ధులని పేరు. వృద్ధి వర్ణములు పూర్వపర వర్ణములు రెండింటికి ఏకాదేశముగా వచ్చుటచే దీనికి వృద్ధిసంధి అని పేరు. మొదటి పదము చివర తప్పక అకారముండి తీరవలెను. రెండవ పదము మొదట 'ఏ' కాని 'ఐ' కాని ఉన్నచో సంధి కలిపినపుడు ఐ ఏకాదేశముగా వచ్చును. రెండవ పదము మొదట 'ఓ' కాని 'ఔ' కాని ఉన్నచో 'ఔ' ఏకాదేశముగా వచ్చును.

**ఐకారము:**

అ+ఏ = ఐ లోక+ఏకము = లోకైకము
ఆ+ఏ = ఐ దయా+ఏధితము = దయైధితము
(దయచే వృద్ధినొందినది)
అ+ఐ = ఐ దేవ+ఐశ్వర్యము = దేవైశ్వర్యము
ఆ+ఐ = ఐ మహా+ఐశ్వర్యము = మహైశ్వర్యము.

**ఔకారము:**

అ+ఓ = ఔ నాక+ఓకసులు = నాకౌకసులు
ఆ+ఓ = ఔ గంగ+ఓఘము = గంగౌఘము
దివ్య+ఔషధము = దివ్యౌషధము
ఆ+ఔ = ఔ మహా+ఔన్నత్యము = మహౌన్నత్యము.

**వృద్ధిసంధి:**

అ+ < ఏ / ఐ > → ఐ

అ+ < ఓ / ఔ > → ఔ

## 4. యణాదేశ సంధి:

ఇ, ఉ, ఋ వర్ణములకు అసవర్ణములకు అసవర్ణము పరమయిన క్రమముగ య, వ, ర లు ఆదేశములగును.

ఇ, ఉ, ఋ లకు ఇక్కులని పేరు. య, వ, ర లకు యణ్ణులని పేరు. యణ్ణులగు య, వ, రలు ఆదేశముగా వచ్చు సంధిగాన యణాదేశ సంధి అని పేరు.

**అసవర్ణములు:**

ఇ – దీనికి ఇ, ఈ లు సవర్ణములు. ఇవిగాక తక్కిన అచ్చులు అసవర్ణములు.

ఉ – దీనికి ఉ, ఊ లు సవర్ణములు. అవిగాక మిగిలిన అచ్చులు అసవర్ణములు.

ఋ – దీనికి ఋ, ౠ లు సవర్ణములు గాన మిగిలిన అచ్చులు అసవర్ణములు.

**వివరణము:** మొదటి పదము చివర ఇ, ఉ, ఋ లలో నొకటి యుండవలెను. రెండవ పదము మొదటి అచ్చు సవర్ణము గానిది యుండవలెను. అనగా అసవర్ణమైన అచ్చు ఉండవలెను.

'ఇ' – దీనికి సవర్ణము కాని అచ్చు పరమైన 'య్' వచ్చును. ఇదియే 'యావడి' (్య) అనబడును.

ఉ – దీనికి సవర్ణముగాని అచ్చు పరమైన 'వ్' వచ్చును దీనినే (్వ) అందురు.

ఋ – దీనికి అసవర్ణము పరమైన 'ర్' (్ర) వచ్చును. దీనినే క్రావడి అందురు.

ముఖ్యగమనిక: యణాదేశ సంధి యందు సంధికి పూర్వము రెండు పదములందును సంయుక్తాక్షరము లేకున్నను, సంధి కలిపిన పిమ్మట సంధి స్థానమునందు సంయుక్తాక్షరము కనబడును.

**ఇకారమునకు యావడి:**

ఇ+అ = య్ అతి+అంత్యము = అత్యంతము
ఇ+ఆ = య్ అతి+ఆనందము = అత్యానందము
ఇ+ఉ = య్ అతి+ఉన్నతి = అత్యున్నతి
ఇ+ఊ = య్ అతి+ఊనము = అత్యూనము

ఇ+ఋ = య్ కవి+ఋషి = కవ్యృషి
ఇ+ఏ = య్ గిరి+ఏకపది = గిర్యేకపది
ఇ+ఐ = య్ అతి+ఐశ్వర్యము = అత్యైశ్వర్యము
ఇ+ఓ = య్ దధి+ఓదనము = దధ్యోదనము
ఇ+ఔ = య్ కవి+ఔత్కంఠ్యము = కవ్యౌత్కంఠ్యము
ఈ+అ = య్ వాణీ+అధిపతి = వాణ్యధిపతి
ఈ+ఆ = య్ సతీ+ఆగ్రహము = సత్యాగ్రహము
ఈ+ఉ = య్ సుధీ+ఉపాస్యము = సుధ్యుపాస్యము
ఇ+ఊ = య్ మాలతి+ఊర్వశులు = మాలత్యూర్వశులు

**యణాదేశ సంధి:**

ఇ, ఉ, ఋ } అసవర్ణమైన అచ్చుపరమైన } య, వ, ర లు వచ్చును.

# హల్సంధులు

## 1. జశ్త్వసంధి:

వర్ణమునందలి ప్రథమాక్షరములకు క, చ, ట, త, ప, లకు అచ్చులు గాని లేదా క, ఖ, చ, ఛ, ట, ఠ, త, థ, ప, ఫ, శ, ష, స వర్ణము తప్ప మిగిలిన హల్లులుగాని పరమయిన పరుషముల స్థానమున వరుసగా గజడదబలు వచ్చును.

(క) వాక్ + ఈశుడు = వాగ్ + ఈశుడు = వాగీశుడు. 'క్' వర్ణము స్థానే 'గ్' వచ్చినది.

(చ) అచ్ + అంతము = అజ్ + అంతము = అజంతము.

(ట) షట్ + ఆననుడు = షడ్ + ఆననుడు = షడాననుడు.

(త) జగత్ + ఈశుడు = జగద్ + ఈశుడు = జగదీశుడు.

(ప) కకుప్ + ఈశుడు = కకుబ్ + ఈశుడు = కకుబీశుడు.

గ, జ, డ, ద, బ లను సంస్కృతమున జశ్శులని అందురు. జశ్శులు వచ్చు సంధిగాన జశ్త్వసంధి అని పేరు.

## 2. అనునాసికసంధి:

పదాంతమందున్న క, చ, ట, త, ప లకు అనునాసికములు (అనగా నిట న, మ వర్ణములను గ్రహింపవలెను.)పరమైన ఆయా వర్గముల యొక్క అనునాసికములే ఆదేశములగును.

**వివరణము:** మొదటి పదము చివర క, చ, ట, త, ప లలో నేదో ఒక పొల్లు హల్లు ఉండవలెను. వానికి పరమందు 'న' గాని 'మ' గాని ఉండవలెను. క వర్ణమునకు ఙ, చ వర్ణమునకు ఞ, ట వర్ణమునకు ణ, త వర్ణమునకు న, ప వర్ణమునకు మ ఆదేశముగా వచ్చును.

(క) వాక్ + మయము = వాఙ్ + మయము = వాఙ్మయము.

(చ) అచ్ + మధ్యము = అఞ్ + మధ్యము = అఞ్మధ్యము.

(ట) మృట్ + మయము = మృణ్ + మయము = మృణ్మయము.

(త) తత్ + మహిమ = తన్ + మహిమ = తన్మహిమ.

(ప) కకుప్ + నేత = కకుమ్ + నేత = కకుమ్నేత.

వాక్ + నైపుణ్యము = వాఙ్నైపుణ్యము, వాగ్నైపుణ్యము.

## 3. శ్చుత్వసంధి:

సకార తవర్గములకు శకార చవర్గములు పరమయిన శకార చవర్గములే వచ్చును.

**వివరణము:** స, త, థ, ద, ధ, న వర్ణములకు శ, చ, ఛ, జ, ఝ, ఞ అను వర్ణములు పరమగునపుడు వరుసగా శ, చ, ఛ, జ, ఝ, ఞ అను వర్ణములే వచ్చును.

సకారమునకు శకారమే గాక చవర్గములోని ఏ వర్ణము పరమైనను శకారము ఆదేశమగును. అటులనే త వర్గమునకు చ వర్గమే గాక శకారము పరమైనను చ వర్గము ఆదేశమగును.

ఉదా॥ తపస్+శక్తి=తపశ్+శక్తి=తపశ్శక్తి (స్+శ=శ)
శరత్+చంద్రిక=శరచ్+చంద్రిక=శరచ్చంద్రిక (త్+చ=చ)
జగత్+జనని=జగజ్+జనని=జగజ్జనని (త్+జ=జ)
నిస్+చలము=నిశ్+చలము=నిశ్చలము (స్+చ=చ)

# విసర్గ సంధులు

విసర్గమునకు గుర్తు రెండు బిందువులు లేక సున్నలు ఒకదాని క్రింద మరొకటియుండును. మొదటి పదము చివర విసర్గ యుండవలెను. ఇందు తెలుగుభాష యందు తరచు కనబడెడి ముఖ్య విసర్గ సంధులీయ బడినవి.

1) సూ॥ విసర్గమునకు క, ఖ, ప, ఫ అను వర్ణములు పరమయిన విసర్గ మారదు.

**వివరణము:** విసర్గమునకు క, ఖ, ప, ఫ అను వర్ణములు పరమున వచ్చినచో ఆ విసర్గము అటులనే నిలిచియుండును. అనగా విసర్గ గుర్తుతోడనే దానిని వ్యవహరింపవలెను.

ఉదా॥ మనః+కమలము = మనఃకమలము
ప్రాతః+కాలము = ప్రాతఃకాలము
మనః+ఖేదము = మనఃఖేదము
అయః+ఖడ్గము = అయఃఖడ్గము
అంతః+పురము = అంతఃపురము
తేజః+పుంజము = తేజఃపుంజము
తపః+ఫలము = తపఃఫలము

2) విసర్గకు శ, ష, స అను వర్ణములు పరమయిన వరుసగ శ, ష, స లే వచ్చును.

**వివరణము:** విసర్గమునకు పరమందు 'శ' వర్ణమున్నచో విసర్గ స్థానమున 'శ' వర్ణమే వచ్చును. అటులనే 'ష' వర్ణము అదిగా గల పదము పరమందున్న విసర్గ స్థానమున 'ష' వర్ణమే వచ్చును. 'స' వర్ణము పరమునందున్న విసర్గ స్థానమున 'స' వర్ణమే వచ్చును.

ఉదా॥ చతుః+శతాబ్దములు =
చతుశ్+శతాబ్దములు = చతుశ్శతాబ్దములు
మనః+శాంతి = మనశ్+శాంతి = మనశ్శాంతి
చతుః+షష్టి = చతుష్+షష్టి = చతుష్షష్టి
తపః+సాధనము = తపస్+సాధనము = తపస్సాధనము

3) సూ॥ అకారమునకు పరమునందున్న విసర్గకు అకారముగాని, శ, ష, స, క, ఖ, చ, ఛ, ట, ఠ, త, థ, ప, ఫ లు తప్ప తక్కిన హల్లులు పరమయిన ఓ కారము వచ్చును.

**వివరణము:** విసర్గకు పూర్వమందు అకారముండవలెను. శివః, రామః, మనః, తపః, వృక్షః మున్నగు పదములందు విసర్గకు పూర్వమందు అకారము గలదు.

ఉదా॥ (శివ్+అ+ః), అటువంటి విసర్గకు పరమునందు శ, ష, స లుండరాదు. క, చ, ట, త, ప లు వాని మహాప్రాణాక్షరములు. అనగా ఖ, ఛ, ఠ, థ, ఫ లు ఉండరాదు. హ, య, వ, ర ల వర్ణములుగాని, అనునాసికములు – ఙ, ఞ, న, ణ, మ లు గాని, గ, జ, డ, ద, బ లు వాని మహాప్రాణాక్షరములు. అనగా ఘ, ఝ, ఢ, ధ, భ లు గాని పరమయిన ఆ విసర్గకు ఓ కారము ఆదేశమగును.

ఉదా॥ తపః+అభిలాష = తప్+ఓ+అభిలాష = తపోభిలాష
యశః+అంచిత = యశ్+ఓ+అంచిత = యశోంచిత

ఉదా॥ మనః+హారము = మనోహారము(మన్+ఓ+హారము)
మనః+వాంఛ = మన్+ఓ+వాంఛ = మనోవాంఛ
శిరః+రత్నము = శిర్+ఓ+రత్నము = శిరోరత్నము
యశః+భూషణము = యశోభూషణము
యశః+ధనము = యశోధనము
తేజః+మూర్తి = తేజోమూర్తి

4) సూ॥ విసర్గకు చ, ఛ లు పరమయిన 'శ' వర్ణమును, ట, ఠ లు పరమయిన 'ష' వర్ణమును, త, థ లు పరమయిన 'స' వర్ణమును వచ్చును.

ఉదా॥ తపః+చర్య = తపశ్+చర్య=తపశ్చర్య
దుః+చరిత్ర = దుశ్+చరిత్ర=దుశ్చరిత్ర
ధనుః+టంకారము = ధనుష్+టంకారము=ధనుష్టంకారము
మనః+తాపము = మనస్+తాపము=మనస్తాపము

5) సూ॥ ఇకారాది అచ్చులు పూర్వమందు గల విసర్గకు క చ ట త ప ఖ, ఛ, ఠ, థ, ఫ, శ, ష, స లు గాక తక్కిన హల్లులను, అచ్చులును పరమగునేని రేఫము వచ్చును.

**వివరణము:** ఇకారాది అచ్చులు అనుటచేత అకారము తప్ప ఇకారము, ఉకారము, ఏకారము, ఓకారము విసర్గకు పూర్వముందుండవలెనని గ్రహించవలెను. దానికి పరమందు ఏ అచ్చు అయినను ఉండవచ్చును. హల్లులందు క చ ట త ప లు, వాని మహాప్రాణాక్షరములు, శ ష స లు తప్ప తక్కిన హల్లులుండవలెను.

ఉదా॥ చతుః+భుజుడు = చతుర్+భుజుడు = చతుర్భుజుడు
బహిః+అంగము = బహిర్+అంగము = బహిరంగము
ఆశీః+వాదము = ఆశీర్+వాదము = ఆశీర్వాదము
దోః+యుగము = దోర్+యుగము = దోర్యుగము
ఉచ్చైః+గతి = ఉచ్చైర్+గతి = ఉచ్చైర్గతి.

6) ఇకారాది అచ్చులు పూర్వమందుగల విసర్గకు క ఖ ప ఫ లు పరమయిన ష కారము వచ్చును.

**వివరణము:** ఇచటను ఇకారాది అచ్చులు అనుటచే విసర్గకు పూర్వమందు అకారముండరాదనియు; ఇకార ఉకార ఎకార ఒకారాదులలో ఏదియైనను ఉండవచ్చుననియు గ్రహింపవలెను.

ఉదా॥ నిః+కృతి =నిష్+కృతి =నిష్కృతి
దుః+కార్యము =దుష్+కార్యము =దుష్కార్యము
ధనుః+కోటి =ధనుష్+కోటి =ధనుష్కోటి
నిః+ఫలము =నిష్+ఫలము =నిష్ఫలము
ఆయుః+కాముడు=ఆయుష్+కాముడు=ఆయుష్కాముడు.

7) కొన్నియెడల విసర్గకు కకారము పరమయిన ఆ విసర్గ 'స' కారముగను 'ష' కారముగను మారును.

ఉదా॥ నమః+కారము = నమస్+కారము = నమస్కారము
అయః+కాంతము = అయస్+కాంతము = అయస్కాంతము
దుః+కృత్యము = దుష్+కృత్యము = దుష్కృత్యము
ఆవిః+కృతము = ఆవిష్+కృతము = ఆవిష్కృతము.

★ ★ ★

# తెలుగు సంధులు

రెండు తెలుగు పదములు(అచ్ఛిక పదములు) కలియునపుడు అగు సంధికి తెలుగు సంధి అని పేరు. ఇందు అనేక రకములు గలవు.

## 1. అకార సంధి

అత్తున కచ్చు పరంబగునపుడు సంధి బహుళముగా నగు.

వివరణము: అత్తు అనగా హ్రస్వమైన అకారమునే గ్రహింపవలెను. అనగా 'అ' వర్ణమునే స్వీకరింపవలెను గాని దీర్ఘ అకారము (ఆ)ను గ్రహింపరాదు. ఈ హ్రస్వ అకారమునకు పరమునందు అచ్చు ఉన్న యెడల సంధి బహుళముగ నగును. బహుళమనగా నాల్గు విధములగు సంధి కార్యము. అవి – నిత్యము, నిషేధము, వైకల్పికము, అన్యవిధము. ఈ నాల్గు విధములు ఒక కార్యమునందు గన్పట్టవలెననియేకాదు. ఈ నాల్గింటిలో ఏ రెండు కార్యములు కన్పట్టినను అది బహుళము అగును.

నిత్యము: అకారాంత నామవాచకములకు శ్రేష్ఠతావాచకములగు అన్నాదులు పరమగునపుడు సంధి నిత్యము.

వివరణము: ఇందు మొదటి పదము నామవాచకమై ఉండవలెను. అదంతమై (హ్రస్వ అకారాంతమై – అ) యుండవలెను. శ్రేష్ఠతావాచకము లనగా గౌరవార్థము ప్రయోగింపబడు అన్న, అమ్మ, అయ్య మున్నగునవి. పరమునందు ఈ శ్రేష్ఠతావాచకము లుండవలెను.

| | | | |
|---|---|---|---|
| ఉదా॥ | రామ+అయ్య | = | రామయ్య |
| | సీత+అమ్మ | = | సీతమ్మ |
| | శివ+అప్ప | = | శివప్ప |
| | మంగ+అక్క | = | మంగక్క |
| | రాజ+అన్న | = | రాజన్న |

అకు అను శబ్దము పరమయినను సంధి నిత్యమగును.

చింత+అకు = చింతాకు

నిషేధము: బహుళగ్రహణముచేత స్త్రీ వాచక తత్సమ సంబోధ నాంతములకు సంధి లేదు. సంధి లేనిచోట యడాగమమగును.

వివరణము: తత్సమములనగా సంస్కృత ప్రాకృత సమములు. ఇట సంస్కృత శబ్దముల చివర తెలుగు విభక్తి ప్రత్యయములు చేర్చుటచే నేర్పడినవని గ్రహింపవలెను. స్త్రీవాచకమన స్త్రీ జాతిని తెలుపు పదములు, సంబోధనమనగా పిలుచుటకుపయోగించు శబ్దములు.

స్త్రీవాచకము: అమ్మ + ఇచ్చెను.

'అమ్మ' అకారాంత స్త్రీ వాచకము. దీనికి 'ఇ' అను అచ్చుపరమైనది. కావున బహుళమనుటచే సంధి నిషేధము గాన యడాగమము వచ్చినది.

అమ్మ+య్+ఇచ్చెను = అమ్మ యిచ్చెను.

'అమ్మిచ్చెను' అనునది అసాధురూపము. వ్యవహరింపరాదు.

తత్సమము: దూత+అతడు

'దూత' అకారాంత తత్సమము. దీనికి 'అ' అచ్చు పరమందున్నది. సంధి నిషేధము.

దూత+య్+అతడు = దూతయతడు.

సంబోధనము: రాముడ+ఇటురమ్ము.

యడాగమము: రాముడ యిటురమ్ము.

'రాముడ' అనునది సంబోధనము.

అవధారణమనగా గట్టిగా నొక్కి చెప్పుట.

నీవ+అడుగుము = నీవ యడుగుము. 'నీవ' అనగా 'నీవే' అని అర్థము నీవే అడుగవలెను అని గట్టిగా నొక్కి చెప్పుటయైనది. కావున 'నీవ' అనునది అవధారణము.

వైకల్పికము: మేన లోనగు శబ్దములకు అచ్చు పరంబగునప్పుడు సంధి వైకల్పికము.

వివరణము: మేన, పుట్టిన, నల్ల మున్నగునవి మేనలోనగు శబ్దములు. వైకల్పికమనగా సంధిచేసి ప్రయోగింపవచ్చును. లేదా సంధి చేయక ప్రయోగింపవచ్చును.

1. మేన+అత్త = మేనత్త (సంధియైనది)
= మేనయత్త (సంధి కాలేదు. యడాగమము వచ్చినది.)
2. పుట్టిన+ఇల్లు = పుట్టినిల్లు, పుట్టినయిల్లు
3. నల్ల+ఆవు = నల్లావు, నల్లయావు.
4. చూడక+ఉండెను = చూడకుండెను, చూడకయుండెను.

అన్యవిధము: ఒక+ఒక = ఒకానొక.

ఇట 'ఒక' నందలి హ్రస్వ అకారమునకు 'ఒ' అను అచ్చు పరముగ 'ఒకయొక' అని సంధిలేని రూపముగాని 'ఒకొక' అని సంధియైన రూపముగాని రాలేదు. 'ఒక' కు 'న' గాగమము వచ్చి, ఒక+న్+ఒక అను రూపమేర్పడి, పిమ్మట 'ఒక' నందలి క వర్ణమునకు దీర్ఘము వచ్చి ఒకా+న్+ఒక = ఒకానొక అను క్రొత్త రూపమేర్పడినది.

## 2. ఇకారసంధి

వైకల్పికము:

1. సూ॥ ఏమ్యాదుల ఇత్తునకు సంధి వైకల్పికముగానగు.

వివరణము: ఏమ్యాదులు అనగా ఏమి, మఱి, కి, షష్ఠి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి అను శబ్దములు. ఇవన్నియు ఆకృతి గణములు.

ఏమి+అంటివి =ఏమంటివి (సంధియైనది)
ఏమి+య్+అంటివి=ఏమియంటివి (సంధి కాలేదు.)
మఱి+ఏమి =మఱేమి
మఱి+య్+ఏమి =మఱియేమి (సంధికాక యడాగమము వచ్చినది.)
హరి+కిన్+ఇచ్చె =హరికిచ్చె, హరికినిచ్చె
అది+ఏమి =అదేమి, అదియేమి
ఏది+అడిగెను =ఏదడిగెను, ఏదియడిగెను.
ఇది+ఇమ్మనెను =ఇదిమ్మనెను, ఇది యిమ్మనెను.

2. క్రియా పదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగానగు.

వివరణము: ఇట క్రియలు అనగా ద్రుతాంతములైన క్రియలు గాదనియు కళలు అగు క్రియాపదముల అంతమందలి హ్రస్వ ఇకారమునకు సంధి చేసియు, చేయకయు వ్యవహరింపవచ్చునని ఎఱుగవలెను.

ఉదా॥ వచ్చిరి+అప్పుడు = వచ్చిరప్పుడు (సంధియైనది)
వచ్చిరి యప్పుడు (సంధి కాలేదు.)

వచ్చితిమి+ఇప్పుడు = వచ్చితిమిప్పుడు,
వచ్చితిమి యిప్పుడు.

ఇట ప్రథమ, ఉత్తమ పురుష క్రియల యందలి ఇకారమునకు సంధి వైకల్పికమని తెలియుచున్నది.

**సంధి నిత్యము:** మధ్యమ పురుష క్రియల యందిత్తునకు సంధియగును.

నీవు, మీరు అను సర్వనామములు కర్తగా నున్నప్పుడు ప్రయోగింపబడు క్రియలు మధ్యమ పురుష క్రియలు.

ఏలితివి+ఇపుడు = ఏలితివిపుడు
ఏలితి+ఇపుడు = ఏలితిపుడు

ఇట 'ఏలితి' అనుటచే మధ్యమపురుష ఏకవచనమందలి వకారము లోపించినను ఈ కార్యము జరుగునని, అనగా సంధి నిత్యమని ఎఱుగవలెను.

ఏలితిరి+ఇపుడు = ఏలితిరిపుడు.

3. సంధి నిషేధము:

క్త్వార్థంబైన ఇత్తునకు సంధిలేదు.

**వివరణము:** క్త్వార్థమనగా భూతకాలిక అసమాపక క్రియ. తెలుగున ధాతువునకు 'ఇ' అను ప్రత్యయము చేర్చుటవలన ఈ క్రియలు ఏర్పడును. ఇచ్చు+ఇ = ఇచ్చి. వీనికి అచ్చు పరమగునపుడు సంధి చేయరాదు. సంధి లేదుగాన యడాగమము వచ్చును.

వచ్చి+ఇచ్చెను = వచ్చి యిచ్చెను
చేసి+ఉండెను = చేసియుండెను.
చదివి+ఆడెను = చదివియాడెను.
చెప్పి+ఏగెను = చెప్పియేగెను.

## 3. ఉకార సంధి

మొదటి పదము చివర హ్రస్వ ఉకార ముండవలెను. దానికి పరమందు అచ్చు ఉండవలెను.

1. **నిత్యము:** ఉత్తునకచ్చు పరమగునపుడు సంధియగును.

**వివరణము:** ఉత్తునకు అనగా హ్రస్వ ఉకారమునకు పరమందు ఏ అచ్చు ఉన్నను సంధి తప్పక చేయవలెను.

ఉదా॥ రాముడు (డ్+ఉ)+అతడు = రాముడతడు
సోముడు (డ్+ఉ)+ఇతడు = సోముడితడు
మనము (మ్+ఉ)+ఉంటిమి = మనముంటిమి
అతడు (డ్+ఉ)+ఎక్కడ = అతడెక్కడ
ఇతడు (డ్+ఉ)+ఒకడు = ఇతడొకడు
సమ్మతము+ఔను (మ్+ఉ) = సమ్మతమౌను
సంసిద్ధులు+ల్+ఉ+ఐరి (మ్+ఉ) = సంసిద్ధులైరి.

ఇందు రాము, సమ్మతము మున్నగు పదములు అన్నియు కళలు, ప్రథమ విభక్త్యంతములు.

2. **వైకల్పికము:** ప్రథమేతర విభక్తి శత్రర్థక చువర్ణములందున్న ఉకారమునకు సంధి వైకల్పికముగా నగు.

**వివరణ:** ప్రథమావిభక్తి అంతముగల ఉత్వమునకు సంధి నిత్యమని పై సూత్రమున పేర్కొనబడినది. ఇట ప్రథమావిభక్తి తప్ప ఇతరములైన విభక్తులు అంతకుముందుగల పదములకు శత్రర్థకమునకు వచ్చు 'చు' అను వర్ణమునందలి ఉకారమునకు అచ్చు పరమైన సంధి వైకల్పికముగా చేయవలెనని తెలుపుటయైనది. శత్రర్థకమనగా వర్తమానార్థక అసమాపక క్రియ. అనగా ద్రుతాంతమందు గల పదములకు, శత్రర్థ చువర్ణము అంతమందుగల పదములకు సంధి చేసియు, చేయకయు ప్రయోగింపవచ్చును.

1. ద్వితీయ – నన్నున్+అడిగె = నన్నడిగె (సంధియైనది)
నన్ను నడిగె (సంధికాలేదు)
2. చతుర్థ – నాకొఱకున్+ఇచ్చె = నాకొఱకిచ్చె, నా కొఱకు నిచ్చె
3. షష్ఠీ – నాకున్+ఆదరవు = నాకాదరవు, నాకు నాదరవు
4. సప్తమి – నాయందున్+ఆశ = నాయందాశ, నాయందునాశ
5. శత్రర్థక 'చు' వర్ణము–వచ్చుచున్+ఉండెను = వచ్చుచుండెను, వచ్చుచునుండెను.

'అందున్' అను ప్రత్యయము మాత్రమే సప్తమికి చెందినదియైనను దీనితోపాటు ఇందున్, ఎందున్ అనునవియు గ్రహించి, వానికి సంధి వైకల్పికముగా చేయవలెను.

ఇందున్+ఉన్నాడు = ఇందున్నాడు, ఇందునున్నాడు
ఎందున్+ఉంటివి = ఎందుంటివి, ఎందునుంటివి.

## 4. ద్విరుక్త టకారాదేశ సంధి

సూ॥ కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దముల ఱ, డ ల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారంబగు.

**వివరణము:** పై శబ్దముల చివరగల ఱు, డు వర్ణముల స్థానమున వానిని కొట్టివేసి ద్విరుక్తటకారము (ట్ట్) అనగా టకారము క్రింద టకారము ఆదేశముగ వచ్చును. పిమ్మట ఇది మీదినున్న అచ్చుతో కలియును.

| | | | | |
|---|---|---|---|---|
| కుఱు+ఉసురు | = | కుట్ట్+ఉసురు | = | కుట్టుసురు |
| చిఱు+ఎలుక | = | చిట్ట్+ఎలుక | = | చిట్టెలుక |
| కడు+ఎదురు | = | కట్ట్+ఎదురు | = | కట్టెదురు |
| నడు+ఇల్లు | = | నట్ట్+ఇల్లు | = | నట్టిల్లు |
| నిడు+ఊరుపు | = | నిట్ట్+ఊరుపు | = | నిట్టూరుపు. |

## 5. గ, స, డ, దవాదేశ సంధి:

సూ॥ ప్రథమ మీద పరుషములకు గసడదవలు బహుళముగానగు.

**వివరణము:** ఇందు మొదటి పదము ప్రథమా విభక్తిలో నుండవలెను. రెండవ పదము మొదట క, చ, ట, త, ప లుండవలెను. అవి గ, స, డ, ద, వ లుగ మారును. అనగా క వర్ణము గ వర్ణముగను, చ వర్ణము స వర్ణముగను, ట వర్ణము డ వర్ణముగను, త వర్ణము ద వర్ణముగను, ప వర్ణము వ వర్ణముగను మారును.

ఉదా॥ 1. వాడు+కొట్టె = వాడుగొట్టె, వాడుకొట్టె
2. నీవు+టక్కరివి = నీవు డక్కరివి, నీవు టక్కరివి
3. వారు+పోరు = వారు వోరు, వారు పోరు
4. మీరు+తెలిపిరి = మీరు దెలిపిరి, మీరు తెలిపిరి
5. అపుడు+చనియె = అపుడు సనియె, అపుడు చనియె

అపుడు, ఇపుడు, ఎపుడు శబ్దములు నిత్యైక వచనాంతములు. అనగా ప్రథమా విభక్తియందలివి అని అర్థము. ఈ గసడదవాదేశము ప్రథమ మీదనేగాక కళలగు క్రియాపదముల మీదను వైకల్పికముగ వచ్చును.

ఉదా॥ రారు+కదా = రారుగదా, రారుకదా
వత్తురు+పోదురు = వత్తురు వోదురు, వత్తురు పోదురు.

**నిత్యము:** ద్వంద్వంబునం బదంబు పయి పరుషములకు గ, స, డ, ద, వ లగు.

**వివరణము:** ద్వంద్వమనగ రెండు పదములకు సమానముగ ప్రాధాన్యము నిచ్చుట. ఒకే విభక్తియందున్న రెండు నామవాచకములని చెప్పవచ్చును.

ఉదా॥ కూర+కాయలు = కూరగాయలు
కాలు+చేతులు = కాలుసేతులు
టక్కు+టెక్కులు = టక్కుడెక్కులు
తల్లి+తండ్రులు = తల్లిదండ్రులు
ఊరు+పల్లెలు = ఊరువల్లెలు

ఈ సంధి నిత్యమయినను కొన్ని ద్వంద్వ సమాసములలో నిది గానరాదు.

ఉదా॥ అందచందములు, అప్పాచెల్లెండ్రు,
కండతుండెములు, రాకపోకలు

**నిషేధము:** తెలుగుల మీది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు.

**వివరణము:** మొదటి పదము తెలుగై, రెండవ పదము సంస్కృత సమమై, ఆ రెండవ పదము మొదట పరుషమున్నచో ఈ సంధి కార్యము జరుగదు.

ఉదా॥ వాడు+కంసారి = వాడు కంసారి
వీడు+చక్రపాణి = వీడు చక్రపాణి
అయది+టంకృతి = అయది టంకృతి
అది+తథ్యము = అది తథ్యము
ఇది+పథ్యము = ఇది పథ్యము

ఇందు వాడు, వీడు, అయది, అది, ఇది అనునవి అచ్ఛికములు. కంసారి, చక్రపాణి మున్నగునవి సంస్కృత సమములు. కాన గసడదవలు రాలేదు.

## 6. సరళాదేశ సంధి

1. **సూ॥** ద్రుతప్రకృతికము మీది పరుషములకు సరళములగు.

**వివరణము:** మొదటి పదము చివర ద్రుతముండవలెను. ఈ ద్రుతము ఏ రూపములోనయినా నుండవచ్చును. ఉదా॥ న్, ను-

న, ని. రెండవ పదము మొదట పరుషములగు క, చ, ట, త, ప లుండవలెను. సంధియైన పిదప పరుషముల స్థానమున సరళములగు గ, జ, డ, ద, బ లు వచ్చును. అనగా క వర్ణమునకు గ, చ వర్ణమునకు జ, ట వర్ణమునకు డ, త వర్ణమునకు ద, ప వర్ణమునకు బ వచ్చును.

ఉదా॥ పూచెను+కలువలు = పూచెను గలువలు
తోచెను+చుక్కలు = తోచెను జుక్కలు
చేసెను+టక్కులు = చేసెను డక్కులు
నెగడెను+తమములు = నెగడెను దమములు
మొగిడెను+పద్మము = మొగిడెను బద్మము

2. సూ॥ ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు.

**వివరణము:** ఆదేశ సరళము లనగా వ్యాకరణ కార్యముచేత పరుషములకు బదులుగా వచ్చిన సరళములు. అనగా పై సూత్రమువలన వచ్చిన సరళములని గ్రహింపవచ్చును. బిందువు అనగా అరసున్న, నిండు సున్న–రెంటిని గ్రహింపవలెను. సంశ్లేషమనగా మీది హల్లుతో కలియుట అనగా ఆదేశముగా పరుషముల స్థానమున వచ్చిన సరళములకు ముందున్న ద్రుతమునకు అర్ధబిందువుగాని, పూర్ణబిందువు (నిండుసున్న)గాని వచ్చును. లేదా ద్రుతము, దాని తరువాత నున్న అచ్చుతో కలిసి సంయుక్తాక్షర మేర్పడును.

ఉదా॥ పూచెను గలువలు

ఇట గ ఆదేశముగా క వర్ణస్థానమున వచ్చినది. దీనికి ముందు 'ను' అను ద్రుతము గలదు. ద్రుతము స్థానమున అరసున్నగాని, నిండు సున్నగాని రాగా–పూచెఁ గలువలు, పూచెంగలువలు అగును.

ద్రుతము మీది హల్లుతో కలియగా –

పూచెన్+గలువలు = పూచెన్గలువలు అగును.

అటులనే తోచెఁ జుక్కలు, తోచెంజుక్కలు, తోచెన్జుక్కలు.

3. సూ॥ ద్రుతమునకు సరళస్థిరంబులు పరంబులగునపుడు లోప సంశ్లేషలు విభాషనగు.

**వివరణము:** ద్రుతమునకు ఆదేశసరళములు గాక సహజముగ శబ్దమందున్న సరళములుగాని, స్థిరవర్ణములుగాని పరమయిన ఆ ద్రుతము పూర్తిగా లోపించవచ్చును; లేదా మీది హల్లుతో కలియవచ్చును.

ఉదా॥ వచ్చెను+గోవులు = వచ్చెగోవులు (లోపము)
వచ్చెన్+గోవులు = వచ్చెన్గోవులు (సంశ్లేషము)

ఇట 'గోవు' నందలి గకారము ఆదేశసరళము గాదు. 'గోవు' శబ్దమునందే సహజముగా నున్నది. స్థిరము లనగా వ్యాకరణ కార్యముచే సాధారణముగ మార్పునొందక స్థిరముగ నుండునవి. అనగా పరుష సరళములు కానివి.

ఉదా॥ మొఱసెను+ఖడ్గము = మెఱసె ఖడ్గము.

## 7. నుగాగమ సంధులు

1. సూ॥ సమాసంబుల ఉదంతంబులగు స్త్రీ సమంబులకు పు, ంపు లకు పరుష సరళములు పరములగునపుడు నుగాగమం బగు.

వివరణము: సమాసపదమై యుండవలెను. మొదటి పదము హ్రస్వ ఉకారాంతమైన స్త్రీ సమమై యుండవలెను. స్త్రీ సమమనగా ప్రథమా విభక్తికి ప్రత్యయములు చేరి లోపించిన అచ్చ తెలుగు పదములు. పు, ంపు లతో అంతమైన పదమయినను మొదటి పదముగ నుండవలెను. వానికి పరుషములుగాని, సరళములుగాని పరమయిన 'ను' అనునది ఆగమముగ వచ్చును.

ఉదా॥ ఉదంత స్త్రీ సమమునకు పరుషము పరమగుట.

చిగురు+కయిదువు

నుగాగమము రాగా చిగురు+న్+కయిదువు

సరళాదేశము బిందువు రాగా – చిగురుఁగయిదువు
చిగురుంగయిదువు

సంశ్లేషరూపము: చిగురున్గయిదువు

ఉదంత స్త్రీ సమమునకు సహజ సరళము పరమగుట

తళుకు+గజ్జెలు = తళుకున్+గజ్జెలు.

ఇట సరళము పరమయినది గాన "ద్రుతమునకు సరళ స్థిరములు పరములగునపుడు లోపసంశ్లేషలు విభాషనగు" అను సూత్రముచే ద్రుతమునకు లోపము సంశ్లేషముగాక పూర్ణ బిందురూపము ఏర్పడును.

తళుకు గజ్జెలు (లోపము)
తళుకున్గజ్జెలు (సంశ్లేషము)
తళుకుంగజ్జెలు (పూర్ణబిందువు)

పు వర్ణమునకు పరుషము పరమగుట.

సింగము+కొదమ

కర్మధారయమునందు ము వర్ణకమునకు పు, ంపు లగు అను సూత్రముచే నిది కర్మధారయ సమాసముగాన, ఇందలి 'సింగము' అను పదమునందలి 'ము' వర్ణకమునకు 'పు' వర్ణము ఆదేశముగా వచ్చినది.

సింగపు+కొదము

నుగాగమము రాగా సింగపు+న్+కొదమ

పరుషము పరమగుటచే బిందు సంశ్లేషలురాగా సింగపుఁ గొదమ, సంగపుం గొదమ, సింగపున్గొదమ అగును.

'ంపు' నకు సరళము పరమగుట

ఉదా॥ ఉన్నతము+గొడుగు

కర్మధారయ సమాసముగాన 'ము' నకు 'ంపు' రాగా

ఉన్నతంపు+గొడుగు

సరళము పరమయినదిగాన లోప, పూర్ణబిందు సంశ్లేష రూపములు వచ్చును.

ఉన్నతపుఁగొడుగు, ఉన్నతంపుఁ గొడుగు, ఉన్నతపు న్గొడుగు.

2. సూ॥ ఉదంత స్త్రీ సమంబులకు, పుంపులకు, అదంత గుణవాచకములకు తనంబు పరమగునపుడు నుగాగమంబగు.

వివరణ: హ్రస్వ అకారము అంతమందుగల స్త్రీ సమములకు, కర్మధారయ సమాసమునందు ము వర్ణస్థానమున వచ్చిన పు, ంపు లు చివరగల పదములకు, అత్తు (హ్రస్య అకారము) చివరగల గుణవాచకములైన నల్ల, తెల్ల, పచ్చ, ఎఱ్ఱ, పుల్ల, తియ్య మున్నగు పదములకు 'తనము' అను ప్రత్యయము పరమయిన 'నుక్' ఆగమముగా వచ్చును.

ఉదంత స్త్రీ సమమునకు తనము పరమగుట.

ఉదా॥ సొగసు+తనము = సొగసు+న్+తనము

సొగసు+న్+దనము. బిందు, సంశ్లేషలురాగా

సొగసుఁదనము, సొగసుందనము, సొగసున్దనము అగును.

'ంపు'నకు తనము పరమగుట.

ఉదా॥ సరసము+తనము

కర్మధారము సమాసముగాన 'ంపు' ఆదేశము

సరసంపు+తనము

నుగాగమము రాగా సరసంపు+న్+తనము
సరళాదేశము రాగా సరసంపు+న్+దనము

బిందు సంశ్లేషలు.–సరసంపుఁదనము, సరసంపుందనము, సరసప్పున్దనము.

ఉదంత గుణవాచకమునకు తనము పరమగుట.

తెల్ల+తనము = తెల్ల+న్+తనము
తెల్ల+న్+దనము = తెల్లఁదనము
తెల్లందనము, తెల్లన్దనము

3. సూ॥ షష్ఠీ సమాసము నందు ఉకార ఋ కారములకు అచ్చు పరమగునపుడు ను గాగమమగు.

**వివరణము:** షష్ఠీ తత్పురుష సమాసమై యుండవలెను. మొదటి పదము చివర ఉకారము గాని ఋకారము గాని ఉండవలెను. రెండవ పదము మొదట అచ్చు ఉండవలెను.

ఉదా॥ రాజు+అజ్ఞ = 'రాజుయొక్క అజ్ఞ' అని షష్ఠీ తత్పురుష సమాసమైనది.

'రాజు' నందలి 'జు' వర్ణములో ఉకారమున్నది. (జ్+ఉ = జు) దానికి 'అ' అను అచ్చు పరమైనది. నుగాగమమురాగా

రాజు+న్+అజ్ఞ = రాజునాజ్ఞ
విధాతృ+అనతి = విధాతృని యొక్క అనతి
ఋ కారము అంతమందుగలదు (త్+ఋ = తృ)
విధాతృ+న్+అనతి = విధాతృనానతి.
ఇటులనే – రాజు+ఇల్లు = రాజునిల్లు,
రాజు+ఎదుట = రాజునెదుట ఇత్యాదులు ఎఱుగునది.

4. సూ॥ ఉదంత తద్ధర్మార్థక విశేషణమునకు అచ్చు పరమగునపుడు నుగాగమంబగు.

**వివరణము:** ధాతువులే నామములకు ముందు వచ్చిన వానిని తద్ధర్మార్థక విశేషణములందురు. తద్ధర్మమనగా భూత భవిష్యద్వర్తమానార్థములయొక్క ధర్మమును తెల్పునది. చేయు, పోవు, చదువు, చూచు మున్నగునవి.

మొదటి పదము ఉకారము అంతమందుగల తద్ధర్మార్థక విశేషణమై యుండవలెను.

రెండవ పదము మొదట అచ్చు ఉండవలెను.

చేయు+అతడు = చేయునతడు: తద్ధర్మార్థక విశేషణము. 'యు' అను దానిలో ఉకారమున్నది. (య్+ఉ = యు) దానికి 'అ' పరమైనది. నుగాగమము రాగా

చేయు+న+అతడు = చేయునతడు
చేసెడు+అతడు = చేసెడు+న+అతడు
చేసెడునతడు
చదువు+ఇతడు = చదువునితడు
వ్రాయు+ఎవడు = వ్రాయు నెవడు
చెప్పు+ఒకడు = చెప్పునొకడు

## 8. కర్మధారయ సమాస సంధులు:

### టుగాగమ సంధులు

1. సూ॥ కర్మధారయములందు ఉత్తునకు అచ్చు పరమగునపుడు టుగాగమంబగు.

**వివరణ:** కర్మధారయ సమాసమై యుండవలెను. మొదటి పదము చివర ఉకార ముండవలెను. రెండవ పదము మొదట అచ్చు ఉండవలెను. ఉత్వసంధి ప్రకారము నిత్యముగ సంధి చేయవలసియున్నది. కాని, ఇట ఉకారసంధి రాదు. టుక్ అనునది ఆగమముగా వచ్చును.

ఉదా॥ కఱకు+అమ్ము = కఱకు+ట్+అమ్ము = కఱకుటమ్ము
నిగ్గు+అద్దము = నిగ్గు+ట్+అద్దము = నిగ్గుటద్దము
ఎండు+ఆకు = ఎండు+ట్+ఆకు = ఎండుటాకు
ముద్దు+ఉంగరము = ముద్దు+ట్+ఉంగరము = ముద్దుటుంగరము

2. సూ॥ కర్మధారయము నందు పేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు.

**వివరణ:** కర్మధారయ సమాసమై యుండవలెను. పేర్వాదులు అనగా పేరు, చిగురు, పొదరు, పొగరు మున్నగునవి వీటిని టుగాగమము వైకల్పికముగ వచ్చును. అది రాని పక్షమున ఉకారసంధి వచ్చును.

పేరు+ఉరము = పేరు+ట్+ఉరము = పేరుటురము, పేరురము.
కాఱు+ఎండ = కాఱుటెండ, కాఱెండ

పొదరు+ఇల్లు = పొదరుటిల్లు, పొదరిల్లు
చిగురు+ఆకు = చిగురుటాకు, చిగురాకు

N.B. ఉకారాంతముల మీదనే గాక ఇతరాచ్చుల మీదను, పేర్వాది శబ్దము కాని వానిమీదను ఈ టుగాగమము కన్పించును.

దుక్కి+ఎద్దు = దుక్కిటెద్దు
తేనె+ఈగ = తేనెటీగ
మిద్దె+ఇల్లు = మిద్దెటిల్లు
పల్లె+ఊరు = పల్లెటూరు

'పేరు' శబ్దమునకు వైకల్పికముచే కొన్నిటియందు టుగాగమము రాదు.

పేరు+ఈను = పేరీను
పేరు+ఉక్కు = పేరుక్కు

## రుగాగమ సంధులు

రెండు పదములకు సంధియగునపుడు రకారము అధికముగ అగమముగా వచ్చి చేరును.

1. సూ॥ పేదాది శబ్దములకు ఆలు శబ్దము పరమగునపుడు కర్మధార యమునందు రుగాగమంబగును.

**వివరణము:** కర్మధారయ సమాసమై యుండవలెను. పేదాదులనగా పేద, బీద, ముద్ద, బాలెంత, కొమ, జవ, అయిదువ, గొడ్డు—ఇత్యాదులు. ఈ పదములలో నొకటి మొదటి పదముగ నుండవలెను. దానికి ఆలు పరమయిన 'ర' అగమముగ వచ్చును.

పేద+ఆలు = పేద+ర్+ఆలు = పేదరాలు
బీద+ఆలు = బీద+ర్+ఆలు = బీదరాలు

ఇటులనే బాలెంతరాలు, కొమరాలు, జవరాలు - ఇత్యాదులు.

2. సూ॥ కర్మధారయమునందు తత్సమంబుల కాలు శబ్దము పరమగునపుడు అత్వంబునకు ఉత్వంబును, రుగాగమంబును అగు.

**వివరణము:** ఇదియు కర్మధారయ సమాసమై యుండవలెను. పై సూత్రమునందు అచ్చికపదములు మాత్రమే గలవు. ఈ సూత్రము తత్సమ పదములకు అన్వయించును. పై సూత్రమునందు 'పేద' మున్నగు శబ్దములందు ఎట్టి మార్పు కలుగలేదు. ఈ సూత్రమందు అకారాంత శబ్దములు ఉకారాంతమైన పిమ్మట రుగాగమం బగును.

ఉదా॥ ధీర+ఆలు = ధీర్+ఉ+ఆలు ఉత్వము
ధీరు+ఆలు = ధీరు+ర్+ఆలు=ధీరురాలు
గుణవంత+ఆలు = గుణవంతు+ఆలు
గుణవంతు+ర్+ఆలు = గుణవంతురాలు

అటులనే బుద్ధిమంతురాలు, నిపుణురాలు, పూజ్యురాలు, నాయకురాలు.

## పు, ంపులు ఆదేశ సంధి

సూ॥ కర్మధారయమునందు ము వర్ణకంబునకు పు, ంపులగు.

**వివరణము:** కర్మధారయ సమాసమునందు మొదటి పదము యొక్క చివరనున్న 'ము' అను వర్ణము పోయి, దాని స్థానమున 'పు' గాని బిందుపూర్వక పు (ంపు) గాని వచ్చును.

సరసము+మాట = సరసపుమాట, సరసంపుమాట, 'సరసమైన మాట' అని విశేషణ పూర్వపద కర్మధారయ సమాసము. కావున 'ము' పోయి పు, ంపులు వచ్చినవి.

విరసము+వచనము = విరసపు వచనము, విరసంపు వచనము.

## 9. ప్రాతాదుల సంధులు:

1. సూ॥ సమాసంబున ప్రాతాదుల తొలి యచ్చు మీది వర్ణముల కెల్ల లోపంబు బహుళముగా నగు.

**వివరణము:** ప్రాత, లేత, పూవు, కెంపు, మీదు, చెన్ను మున్నగునవి ప్రాతాదులు. సమాసమగునపుడు ఈ శబ్దముల మొదటి అక్షరము మాత్రమే మిగిలి తక్కినవి పూర్తిగా లోపించును. 'మీది వర్ణముల కెల్ల' అనుటచే అర్ధబిందువు (అరసున్న) కూడ లోపించునని గ్రహింపవలెను. అర్ధబిందువు ఒక వర్ణముగ వర్ణమాలలో పేర్కొనబడినది.

ఉదా॥ ప్రాఁత+ఇల్లు = ప్రా మాత్రమే మిగిలినది.
(ఁత లోపించినది)
ప్రా+ఇల్లు = యడాగమము వచ్చినది
ప్రా+య్+ఇల్లు = ప్రాయిల్లు, ప్రాతయిల్లు
లేఁత+దూడ = లే+దూడ = లేదూడ, లేఁతదూడ
పూవు+రెమ్మ = పూరెమ్మ, పూవురెమ్మ.

2. సూ॥ లుప్త శేషంబునకు పరుషము పరమగునపుడు నుగాగమంబగు.

**వివరణములు:** లుప్తశేషమనగా లోపింపగా మిగిలినది. పై సూత్రము చేత మిగిలిన మొదటి అక్షరములగు ప్రా, లే, పూ, మీ అనునవి లుప్తశేషములు. వీరిని పరుషములు పరమునందున్న 'నుక్' ఆగమ మగును.

1) ప్రాంత+కెంపు–తొలి యచ్చుమీది వర్ణములకు లోపము.

ప్రా+కెంపు. ఇట పరుషము పరమయినది గాన ను గాగమము వచ్చును.

ప్రా+న్+కెంపు

ద్రుతప్రకృతికము మీద పరుషము సరళమగును.

ప్రా+న్+గెంపు

ఆదేశ సరళమునకు ముందున్న ద్రుతమునకు బిందువు వచ్చును. ఇట అర్ధబిందువు వచ్చును.

ప్రాఁగెంపు.

2) మీదు+కడ = మీ+కడ = మీన్+కడ
మీన్+గడ = మీఁగడ = అర్ధబిందు రూపమే ఉండును.

3) లేఁత+కొమ్మ = లే+కొమ్మ = లే+న్+కొమ్మ.
లే+న్+గొమ్మ = లేఁగొమ్మ

4) పూవు+తోఁట = పూ+తోఁట = పూ+న్+తోట.
పూ+న్+దోట = పూఁదోఁట

5) కెంపు+తామర = కె+తామర = కె+న్+తామర = కె+న్+దామర = కెందామర (పూర్ణబిందు రూపమేర్పడును)

6) చెన్ను+తొవ = చె+తొవ = చె+న్+తొవ =
చె+న్+దొవ = చెందొవ (పూర్ణబిందు రూపము)

## 10. క్రొత్తాదుల సంధి:

1. సూ॥ క్రొత్త శబ్దమునకు ఆద్యక్షర శేషమునకు కొన్ని యెడల ను గాగమము, కొన్ని యెడల మీది హల్లునకు ద్విత్వము అగును.

**వివరణము:** ఈ సూత్రము ప్రత్యేకించి క్రొత్త శబ్దము కొఱకై చెప్పబడినది. ఆద్యక్షర శేషము అనగా ఆదినున్న అక్షరము శేషించుట

లేక మిగులుట. ఇట్లు మీది అక్షరములు లోపింపగా మిగిలిన మొదటి అక్షరము అనగా 'క్రొ'నకు క చ ట త ప లు పరమయిన కొన్నిసార్లు ను గాగమమును, మరికొన్ని చోట్ల దానికి పరమైన హల్లునకు అదే వత్తును వచ్చును. ను గాగమమైన మీది హల్లు అనగా పరుషము సరళమగును. ఈ ఆదేశ సరళమునకు ముందున్న ద్రుతమునకు బిందువు మాత్రమే వచ్చును. సంశ్లేషము రాదు.

క్రొత్త+చాయ

సమాసంబున ప్రాతాదుల తొలి యచ్చు మీది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు.

క్రొ+చాయ

ఈ సూత్రముచేత కొన్ని యెడల ను గాగమ మగునుగాన క్రొ+న్+చాయ.

ద్రుత ప్రకృతికము మీది పరుషములకు సరళములగు. క్రొ+న్+జాయ.

ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు. ఇట బిందువు. క్రొంజాయ.

1) క్రొత్త+చెమట = క్రొ+చెమట = క్రొ+న్+చెమట = క్రొ+న్+జెమట = క్రొంజెమట.

2) క్రొత్తపసిడి = క్రొ+పసిడి = క్రొ+న్+పసిడి
క్రొత్త+న్+బసిడి = క్రొంబసిడి

3) క్రొత్త+కారు = క్రొ = కారు

ఇట కొన్ని యెడల మీది హల్లునకు ద్విత్వము అని ఈ సూత్రములలో చెప్పటచే 'కా'కు అదే వత్తు రాగా

క్రొ+క్కారు = క్రొక్కారు

4) క్రొత్త+తావి = క్రొ+తావి ద్విత్వము రాగా క్రొత్తావి.

పరుషములు పరమయిన ను గాగమము వచ్చునని చెప్పబడినది కాని పరుషేతరములు అనగా పరుషములు తప్ప ఇతరములైన హల్లులు పరమయిన ను గాగమము రాదుగాన వానికి ద్విత్వమే వచ్చును.

1) క్రొత్త+గండి ఇట 'గ' పరుషము కాదు. సహజ సరళము కాన ద్విత్వము వచ్చును.
క్రొ+గండి = క్రొగ్గండి

2) క్రొత్త+నన = క్రొ+నన = క్రొన్నన
3) క్రొత్త+మావి = క్రొ+మావి = క్రొమ్మావి.

2. సూ॥ అన్యంబులకు సహితము ఇక్కార్యము కొండొకచో గానంబడియెడి.

వివరణము: క్రొత్త శబ్దమునకే గాక ఇంకను కొన్ని శబ్దములకు మరికొన్ని శబ్దములు పరమగునపుడు లోపము ను గాగమమును కల్గుచుండును. అటులనే మరికొన్ని శబ్దములకు సంధి యగునపుడు లోపద్విత్వములు కల్గుచుండును.

ఉదా॥ 1. పది+తొమ్మిది 'పది' అను పదము ప్రాతాదుల లోనిదిగాదు. అయినను మొదటి అక్షరము మాత్రమే మిగులును.

ప+తొమ్మిది = ను గాగమురాగా
పన్+తొమ్మిది = సరళాదేశమురాగా
పన్+దొమ్మిది = ఆదేశ సరళమునకు ముందు బిందువు రాగా పందొమ్మిది.

2. తొమ్మిది+పది = తొ+పది = తొ+న్+పది
తొన్+బది = తొంబది.

3. వంక+చెఱగు = వ+చెఱగు = వ+న్+చెఱగు
వన్+జెఱగు = వంజెఱగు.

4. సగము+కోరు = స+కోరు = స+న్+కోరు
సన్+గోరు = సంగోరు.

5. నిండు+వెఱ = ని+వెఱ. ఇట మీది హల్లు అగు వ కారమునకు ద్విత్వము వచ్చినది. నివ్వెఱ.

6. నిండు+వెఱగు = ని+వెఱగు = నివ్వెఱగు.

7. నెఱ+తఱి+ = నె+తఱి = నెత్తఱి.

8. నెఱ+నడుము = నె+నడుము = నెన్నడుము.

9. నెఱ+మది = నె+మది = నెమ్మది.

10. నెఱ+వడి = నె+వడి = నెవ్వడి.

పందొమ్మిది అను శబ్దమునుండి నెవ్వడి అను శబ్దము వరకుగల ఈ పది శబ్దములను పై విధముగా విడదీసి "క్రొత్త శబ్దమునకు అద్యక్షర శేషంబులకు...."అను సూత్రమును ప్రప్రథమముగా వ్రాసి, పిమ్మట "అన్యంబులకు సహితము ఇక్కార్యము...." అను సూత్రమును వ్రాయవలెను.

## 11. ఆమ్రేడిత సంధులు

అర్థ విశేషమును, తీవ్రతను ప్రకాశింపచేయుటకు ఒక పదమును వెంట వెంటనే రెండు సార్లు ప్రయోగించిన, అందు రెండవసారి ప్రయోగించిన పదమును ఆమ్రేడితము అందురు.

1. సూ॥ అచ్చునకు ఆమ్రేడితము పరమగునపుడు సంధి తఱచుగనగు.

ఉదా॥ ఔర+ఔర రకారమునందలి అచ్చునకు(ర్+అ = ర) ఆమ్రేడితమగు 'ఔర' పరమైనది–సంధి కావలెను. పూర్వపర స్వరములకు పరస్పర మేకాదేశమగును.

ఔర+ఔర = ఔరౌర
ఆహా+ఆహా = ఆహాహా(హ్+ఆ=హా)
ఓహో+ఓహో = ఓహోహో (హో+ఓ+హో)

తఱచుగ అనుటచేత కొన్నిచోట్ల ఈ సంధి వైకల్పికము.

ఏమి+ఏమి = ఏమేమి, ఏమియేమి

2. సూ॥ ఆమ్రేడితము పరమగునపుడు కడాదుల తొలి యచ్చు మీది వర్ణముల అదంతంబగు ద్విరుక్త టకారంబగు.

వివరణము: కడ, ఎదురు, కొన, చివర, తుద, తెన్ను, తెరువు, నడుము, పగలు, పిడుగు, బయలు, మొదలు–ఇత్యాదులు కడాదులు. అదంతమగు ద్విరుక్త టకారము అనగా హ్రస్వ అకారముతో అంతమగు టకారము దాని వత్తుతో ఉండుట.

(ట్ట = ట్ట్+అ) మొదటి పదములోని మొదటి అక్షరము మాత్రమే మిగిలి, తక్కినవి పోయి, వాని స్థానమున 'ట్ట' వచ్చును.

ఉదా॥ కడ+కడ = కట్టకడ
ఎదురు+ఎదురు = ఎట్టెఎదురు
కొన+కొన = కొట్టకొన
చివర+చివర = చిట్టచివర

అటులనే తుట్టతుద, తెట్టతెన్ను, తెట్టతెరువు, నట్టనడుమ, పట్టపగలు, పిట్టపిడుగు, బట్టబయలు, బిట్టబిగియు, అట్టఅడుగు, మిట్టమిట్టు ఇత్యాదులను గ్రహింపవలెను.

3. సూ॥ ఆమ్రేడితము పరమగునపుడు విభక్తి లోపము బహుళముగానగు.

వివరణము: మొదటి పదము చివరనున్న విభక్తి ప్రత్యయము లోపించును.

ఉదా॥ అప్పటికిన్+అప్పటికిన్ = మొదటి పదము చివరనున్న 'కిన్' అను షష్ఠీవిభక్తి ప్రత్యయము లోపించినది.

అప్పటి+అప్పటికిన్ = అప్పటప్పటికిన్
వైకల్పికముగా అప్పటికప్పటికిన్ అగును
అక్కడన్+అక్కడన్ = అక్కడక్కడన్
మాటికిన్+మాటికిన్ = మాటిమాటికిన్
ఇంటన్+ఇంటన్ = ఇంటింటన్
ఊరన్+ఊరన్ = ఊరూరన్

ఇంచుక, నాడు ఇత్యాది పదములందు చివర విభక్తి ప్రత్యయము లేకున్నను చివరనున్న అక్షరమే లోపించును.

ఇంచుక+ఇంచుక = ఇంచించుక, ఇంచుకించుక
నాడు+నాడు = నానాడు, నాడునాడు
కొంచెము+కొంచెము = కొంచెకొంచెము, కొంచెముకొంచెము

4. సూ॥ ఆమ్రేడితము పరమగునపుడు మధ్యమ పురుష ము, డు లకు లోపము విభాషనగు.

**వివరణము:** మధ్యమ పురుష ఏకవచనమునందు 'ము' బహు వచనమునందు 'డు' అను క్రియావిభక్తులకు ఆమ్రేడితము పరమయిన లోపము వచ్చును. మిగిలిన క్రియావిభక్తులకు రాదు.

ఉదా॥ ఉండుము+ఉండుము = మొదటి పదము చివరి 'ము' అను ఏకవచన ప్రత్యయము లోపించినది.

ఉండు+ఉండుము = ఉండుండుము
నిలుము+నిలుము = నిలు+నిలుము = నిలునిలుము
కొట్టుడు+కొట్టుడు = కొట్టుకొట్టుడు.

వైకల్పికముగాన సంధి చేయకున్నచో ఉండుముండుము, నిలుము నిలుము, కొట్టుడు కొట్టుడు అను రూపములుండును.

5. సూ॥ అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

**వివరణము:** అందుకు, ఇంకు, ఇగ్గు, చెదరు, తుమురు, వీగు, మిట్లు, తునియలు మున్నగునవి సంధి యగుటకు సూత్రములు లేవు. అనగా ఏ సూత్రమును వీనికి అన్వయింపదు. కావున వీనిని కావ్యములందు ఎట్లు ప్రయోగింపబడిన అట్లే స్వీకరింపవలెను.

| | | | |
|---|---|---|---|
| 1. | అదుకు+అదుకు | = | అందదుకు |
| 2. | ఇంకులు+ఇంకులు | = | ఇఱ్ఱింకులు |
| 3. | ఇగ్గులు+ఇగ్గులు | = | ఇల్లిగ్గులు |
| 4. | చెదరు+చెదరు | = | చెల్లచెదరు, చెల్లాచెదరు. |
| 5. | తుమురు+తుమురు | = | తుత్తుమురు |
| 6. | తునియలు+తునియలు | = | తుత్తునియలు |
| 7. | మిట్లు+మిట్లు | = | మిఱుమిట్లు |
| 8. | అఁక+అఁక | = | అఱ్ఱాఁక |
| 9. | చెఱ+చెఱ | = | చెచ్చెఱ |
| 10. | వీగు+వీగు | = | విఱ్ఱవీగు |
| 11. | కదలు+కదలు | = | క్రక్కదలు |
| 12. | దుడుకు+దుడుకు | = | దుందుడుకు |
| 13. | వేలు+వేలు | = | వేనవేలు. |

## 12. 'ము' లోప సంధి లేక పడ్వాదుల సంధి

1. ప్రథమావిభక్తి ఏకవచన ప్రత్యయమగు 'ము' లోపించుట.

సూ॥ పడ్వాదుల పరమగునప్పుడు ము వర్ణమునకు లోప పూర్ణబిందువులు విభాషనగు.

**వివరణము:** పడు, పట్టె, పాటు, పెట్టు మున్నగునవి పడ్వాదులు. ఇవి ప్రథమావిభక్తి ప్రత్యయమగు 'ము' వర్ణమునకు పరమునందున్న, ఆ 'ము' వర్ణము వైకల్పికము లోపించును.

**ఉదా॥**

1. భయము+పడె = భయపడె
   పూర్ణబిందు రూపము = భయంపడె
   వైకల్పికముగాన 'ము' లోపింపనిచో భయముపడె.
2. సూత్రము+పట్టె = సూత్రపట్టె = సూత్రంపట్టె, సూత్రముపట్టె
3. వేగిరము+పాటు = వేగిరపాటు, వేగిరంపాటు
4. వేగరము+పఱచు = వేగిరపఱచు, వేగిరంపఱచు
5. భంగము+పాటు = భంగపాటు, భంగంపాటు
6. అడ్డము+పాటు = అడ్డపాటు, అడ్డంపాటు.

# సమాస సంధులు

రెండు పదముల కలయిక వలన సమాసము ఏర్పడినప్పుడు అగు సంధులకు సమాస సంధులని పేరు.

1. సూ॥ చేత, తోడ, వలనల కిత్వంబు సమాసంబులందగు.

ఉదా॥ 1. నీ చేతన్+ప్రోవు = ఇది అలుక్సమాసము. అనగా విభక్తి ప్రత్యయము లోపింపనిది. దీనికి 'సమాసమున ద్రుతమునకు లోపంబగు' అను విధిచే 'న్' లోపింపగా–

నీచేత+ప్రోవు. ఈ సూత్రముచే 'త'లోని అత్వమునకు ఇత్వమురాగా

నీచేత్+ఇ+ప్రోవు = నీ చేతి ప్రోవు.

2. నాతోడన్+చెలిమి

నాతోడ+చెలిమి సమాసమున ద్రుతలోపము.

నా తోడ్+ఇ+చెలిమి అత్వమున కిత్వము = నా తోడి చెలిమి.

3. నీ వలనన్+భయము

నీ వలన+భయము

నీ వలన్+ఇ+భయము

నీ వలని భయము

2. సూ॥ అంద్వాదులకు అలి గాగమము సమాసంబునందు అగు.

**వివరణము:** 1. అందున్, ఇందున్, ఎందున్ అనునవి అంద్వాదులు. వీనికి మరొక పదము పరమైనపుడు సమాసమునందు 'అలిక్' అనునది అగమ మగును.

ఉదా॥ నాయందున్+కరుణ
సమాసమున ద్రుతమునకు లోపమగును
నాయందు+కరుణ
ఇట 'అందు' నకు అలి ఆగమముగ రాగా
నాయందు+అలి+కరుణ = నా యందలి కరుణ

2. ఇందున్+జనులు = ఇందు+జనులు
ఇందు+అలి+జనులు = ఇందలి జనులు

3. ఎందున్+వారు = ఎందు+వారు
ఎందు+అలి+వారు = ఎందలివారు

# త్రికసంధి

1. సూ॥ ఆ, ఈ, ఏ అను సర్వనామములు త్రికంబు అనబడు.

**వివరణము:** 'ఆ' – ఇది దూరమున దెల్పు నిర్దేశార్థక సర్వనామము.

ఈ – దగ్గఱను దెల్పు నిర్దేశార్థక సర్వనామము

ఏ – ప్రశ్నార్థక సర్వనామము.

ఇవి మూడును అనేక పదములతో కలిసి కర్మధారయ సమాస మేర్పడును.

ఆ+కన్య

2. సూ॥ త్రికంబు మీది అసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళముగా నగు.

**వివరణము:** ఆ, ఈ, ఏ అను త్రికము మీద సంయుక్తముకాని హల్లు (శ, ష, స, హ, ర, ఱ లు తప్ప తక్కినవి)నకు ఇదే వత్తు వచ్చును.

ఆ+క్కన్య.

3. సూ॥ ద్విరుక్తంబగు హల్లు పరమగునపుడు అచ్చికంబగు దీర్ఘమునకు హ్రస్వంబగు.

**వివరణము:** ఒక హల్లును రెండుమార్లు పలుకుట ద్విత్వము. ద్విత్వమగు హల్లు పరమయిన అచ్చు తెనుగు శబ్దము దీర్ఘము తప్పక హ్రస్వమగును.

'ఆ' అనునది 'అ' గా మారును.

1. ఆ+కన్య=ఆ+క్కన్య = అక్కన్య.
2. ఈ+కాలము = ఈ+క్కాలము = ఇక్కాలము.
3. ఏ+లోకము = ఏ+ల్లోకము = ఎల్లోకము
4. ఆ+అశ్వము = ఇట త్రికముమీద హల్లుపరముగా లేదు. అచ్చు పరమైనది. దీర్ఘాచ్చునకు మరల అచ్చు పరమైనదిగాన యడాగమము చేయవలెను.

ఆ+యశ్వము

యకారము హల్లుగాన ద్విత్వము వచ్చును.

ఆ+య్యశ్వము.

దీర్ఘము హ్రస్వము కాగా అయ్యశ్వము.

## ద్విగు సమాస సంధులు

మొదట సంఖ్యను తెలుపు విశేషణము, తరువాత నామవాచకము ఉన్నచో ద్విగు సమాసము అగును.

1. సూ॥ సమానాధికరణంబగు ఉత్తరపదము పరమగునపుడు మూఁడు శబ్దము 'డు' వర్ణమునకు లోపమును మీది హల్లునకు ద్విత్వమును అగు.

**వివరణము:** సమానమైన ఆధారముగల ఉత్తరపద ముండవలెను. అనగా సమాసములోని చివరిపదము సమానమై ఆధారముగలదై ఉన్నప్పుడు 'మూఁడు' శబ్దములోని 'డు' వర్ణమునకు లోపమును, దానిమీది హల్లునకు ద్విత్వమును వచ్చును.

ఉదా॥ 1. మూఁడు+జగములు = మూఁ+జ్జగములు. డు లోపించి మీది హల్లుకు ద్విత్వము వచ్చినది. సూ॥ ద్విరుక్తంబగు హల్లు పరమయిన అచ్చికంబగు దీర్ఘము హ్రస్వమగును – ముజ్జగములు.

2. మూఁడు+లోకములు = మూఁ+ల్లోకములు
   ము+ల్లోకములు = ముల్లోకములు
3. మూఁడు+కాలు = మూఁ+క్కాఁలు
   ము+క్కాఁలు = ముక్కాఁలు.
4. మూఁడు+మూరులు = మూఁ+మ్మూరులు = ముమ్మూరులు.

## దుగాగమ సంధి (సమాసము)

1. యుష్మత్ అస్మత్ ఆత్మార్థకంబులకు ఉత్తరపదము పరమగునప్పుడు దుగాగమము విభాషనగు.

**వివరణము:** యుష్మత్ అర్థకము 'నీ' అనుదానికి, అస్మత్ అర్థకము 'నా' అనుదానికి, ఆత్మార్థకము 'తన' అనుదానికి సమాసమునందు మరొక పదము పరమునన్న 'దుక్' ఆగమము వైకల్పికముగ వచ్చును.

నీ+కరుణ = నీదు కరుణ, నీ కరుణ
నా+నేరమి = నాదు నేరమి, నా నేరమి
తన+రూపు = తనదురూపు, తనరూపు.

వీనికి బహువచనమునందు మీదు కరుణ, మీదు నేరమి, తమదురూపు అను రూపములును సిద్ధించును.

# పడ్ప వర్ణాదేశ సంధి

సూ॥ కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల ము వర్ణములకు పడ్ప వర్ణంబులగు.

**వివరణము:** నామ్వాధులు అనగా నాము, పాము, వేము, అమ్ము, ఎమ్ము, ప్రేము మున్నగునవి. కనుమ్వాదులు కనుము, జనుము, ఇనుము, ఉడుము, ఎనుము, మినుము, అనుము, మిరెము మున్నగునవి, ఒకానొక చోట తత్పురుష కర్మధారయ సమాసములందు నాము మున్నగు శబ్దములలోని ము వర్ణమునకు ప వర్ణము ఆదేశమగును.

ఉదా॥ నాము+చేను = నాఁపచేను (పడ్ అనుటచే దీర్ఘము మీద అరసున్న, హ్రస్వము మీద నిండుసున్న వచ్చును.)

పాము+తేడు = పాఁపతేడు
ప్రేమ+సజ్జ = ప్రేఁపసజ్జ
వేము+చెట్టు = వేఁపచెట్టు
అమ్ము+కోల = అంపకోల
ఎమ్ము+గుండు = ఎంపగుండు

**కనుమ్వాదులు:**

కనుము+పూాలు = కనుపపూాలు
జనుము+నార = జనుపనార
ఇనుము+కడ్డి = ఇనుపకడ్డి
ఉడుము+పట్టు = ఉడుపపట్టు
ఎనుము+తేలు = ఎనుపతేలు
మినుము+చేను = మినుపచేను
అనుము+చేను = అనుపుచేను
మిరెము+కాయ = మిరెపకాయ

1. సమాసంబున యందు ద్రుతమునకు లోపంబగు.

**వివరణము:** సర్వము అను అర్థమునిచ్చు 'ఎల్ల' మున్నగు శబ్దములు సమాసమునందు విశేష్యమునకు ముందు ప్రయోగింపబడినప్పుడు వాని ద్రుతము లోపించును.

ఎల్లన్+అర్థములు = ఎల్ల యర్థములు
ఎల్లన్+కలుషములు = ఎల్ల కలుషములు

సూ॥ తలఁ(బ్రాలు మొదలగు సమాసముల ద్రుతమునకు లోపము లేదు.

వివరణము: పై సూత్రము ద్వారా సమాసమునందలి ద్రుతమునకు లోపము వచ్చునని తెలియచుండగా ఈ విధిచే కొన్ని సమాసములందు ద్రుతమునకు లోపము లేదని తెలియుచున్నది.

ఉదా॥ తలన్+ప్రాలు = తలన్+బ్రాలు = తలంఁబ్రాలు
ఒడిన్+ప్రాలు = ఒడిన్+బ్రాలు = ఒడిఁబ్రాలు
సేసన్+ప్రాలు = సేసన్+బ్రాలు = సేసఁబ్రాలు
ఊరన్+పంది = ఊరన్+బంది = ఊరఁబంది
ఊరన్+పిచ్చుక = ఊరన్+బిచ్చుక = ఊరఁబిచ్చుక
తోడన్+పుట్టువు = తోడన్+బుట్టువు = తోడఁబుట్టువు
తోఁబుట్టువు
ఒల్లన్+పాటు = ఒల్లన్+బాటు = ఒల్లఁబాటు
ఒడన్+పాటు = ఒడన్+బాటు = ఒడఁబాటు

సూ॥ బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో ఉపమానము మీది మేనునకు పోడియగు.

వివరణము: బహువ్రీహి సమాసమై, అది స్త్రీ అను అర్థమును తెల్పునదియైన ఉపమానము మీది 'మేను' అను శబ్దమునకు 'పోడి' అను శబ్దము ఆదేశమగును.

1. అలరు+మేను = అలరు+పోడి.

ఉదంత స్త్రీ సమంబులకు పు, ంపు లకు పరుష సరళములు పరమయిన ను గాగమంబగు.

అలరు+న్+పోడి.

ద్రుత ప్రకృతికము మీది పరుషములకు సరళములగు.

అలరు+న్+బోడి.

ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు. అలరుంబోడి యగును. లేదా అలరుబోడి యగును.

2. నన+మేను = ననబోడి
3. పూ+మేను = పూబోడి
4. విరి+మేను = విరిబోడి.

★ ★ ★

# సమాసములు

సమాసములను గూర్చి తెలిసికొనుటకు ముందు వాటి ప్రయోజనమును గూర్చియు తెలిసికొనుట ఉచితము. కొన్ని వర్ణములనుగాని, పదములనుగాని తగ్గించి ఇముడ్చుటకు అనగా సంక్షిప్తము చేయుటకు సమాసము నుపయోగింతురు. ఉదాహరణకు "శుకములు వనమునందున్నవి" "శారికములు వనమందున్నవి" అని ఈ విధముగా రెండు విడి వాక్యములు చెప్పుటకు బదులుగ "శుక శారికములు వనమునందున్నవి" అని ద్వంద్వ సమాసము చేయుటచేత శ్రుతి సుఖముగ నున్నది, పదముల పొదుపుయు జరిగినది.

సమాసమనగా కలయిక. వేఱువేఱు అర్థములుగల సమర్థవంతములైన పదములు కలిసి ఏకపదముగా నేర్పడుట సమాసము. సమాసము ఏర్పడుటకు కనీసము రెండు పదములయిన ఉండవలెను. మొదటి పదమునకు పూర్వపదమనియు, రెండవ పదమునకు ఉత్తర పదమనియు నామములు. 'మేదినీ' అను పదమునకు భూమి అను అర్థము గలదు. 'పతి' అను పదమునకు భర్త అను అర్థము గలదు. ఈ రెండు పదములను గలిపి 'మేదినీపతి' అన్నచో భూపాలుడు (రాజు) అను అర్థము వచ్చును. ఇవి రెండు వేఱువేఱు అర్థములు గల్గినవి. సమాసముగా నేర్పడుటకు సమర్థవంతములైనవి. ఇవి రెండు సమసించి 'రాజు' అను ఏకార్థము నిచ్చుచున్నవి.

రెండు పదములు కలిసి సమాస మేర్పడిన పిమ్మట దానిని ఏ సమాసమో తెలిసికొనవలెను. ఇది విగ్రహ వాక్యము ద్వారా సాధ్యమగును. విగ్రహమనగా వేఱు చేయుట. సమాస పదములను వేఱుచేసి వానిమధ్య గల సంబంధము స్పష్టపఱచు పద సముదాయమునకు విగ్రహవాక్యమని పేరు. అనగా ఒక్క వాక్యములో చెప్పవలెననిన లోపించిన విభక్తి ప్రత్యయములను మరలచేర్చి చెప్పునదియే విగ్రహవాక్యము. ఈ లోపించిన విభక్తులేవియో అతి సూక్ష్మముగ పరిశీలింపవలెను. పదములయొక్క అర్థమును చక్కగ తెలిసికొనిన సమాసమును సులభముగ గుర్తించవచ్చును.

ఉదాహరణకు 'ధరణీపతి' అను సమాసమునకు విగ్రహవాక్యము 'ధరణియొక్క పతి.' ఇట ఇంతకుముందు లోపించిన 'యొక్క' అను షష్ఠీ విభక్తి ప్రత్యయము మరల విగ్రహవాక్యమునందు చేరినది. ఈ విగ్రహవాక్య మేర్పరచుటకు సాధారణముగా సమాసమునందలి పదములనే తీసికొనవలెను. కొన్ని ప్రత్యేక సందర్భములందు సమాసమునందలి పదములతో విగ్రహ వాక్య మేర్పడకున్న అన్యపదములను స్వీకరింపవచ్చును.

భాషాభేదమునుబట్టి సమాసము మూడు రకములు. 1. సాంస్కృతికము, 2. అచ్చికము, 3. మిశ్రమము.

1. సాంస్కృతిక సమాసము మరల రెండు రకములు:

   1. సిద్ధము 2. సాధ్యము.

   ఎ) సిద్ధసమాసము: సమాసమునందలి పూర్వపదము, ఉత్తరపదము రెండును సంస్కృతమై యుండును.

   ఉదా॥ రాజ+ఆజ్ఞ = రాజాజ్ఞ

   తటాక+ఉదకము = తటాకోదకము,

   బి) సాధ్యసమాసము: సంస్కృత సమములచే నేర్పడును.

   రాజు+ఆజ్ఞ = రాజునాజ్ఞ

   తటాకంబు నుదకంబు.

2. అచ్చికము: కేవలము అచ్చతెనుగు పదములచే నేర్పడును.

   ఉదా॥ తేనియానతి, చెఱువునీరు, సిరిచెలువుడు.

3. మిశ్రమము: తత్సమ పదములను, అచ్చిక పదములను కలిపి సమాసము చేయుట.

   ఉదా॥ రాజుముదల: రాజు తత్సమము-ముదల అచ్చికము.

   చెఱువు నుదకము. చెఱువు అచ్చికము.

   ఉదకము తత్సమము.

   సిరివల్లభుడు: సిరి అచ్చికము, వల్లభుడు తత్సమము.


సమాసములు
సాంస్కృతికము
(సంస్కృత పదముల
సమాసము)
సిద్ధము
(కేవల సంస్కృత
పదములు)
1. రాజాజ్ఞ
2. తటాకోదకము
3. లక్ష్మీవల్లభుడు
సాధ్యము
(సంస్కృత సమ
ములతో సమాసము)
1. రాజునాజ్ఞ
2. తటాకంబు నుదకంబు
3. లక్ష్మీవల్లభుడు
అచ్చికము
(అచ్చ తెనుగు
పదముల సమాసము)
1. ఏనియానతి
2. చెరువునీరు
3. సిరిచెలువుడు
మిశ్రమము
(సంస్కృతసమ అచ్చిక
పదముల సమాసము)
1. రాజుముదల
2. చెరువునుదకము
3. సిరివల్లభుడు

అర్థభేదమునుబట్టి సమాసములు ఆరు రకములు:

1. అవ్యయీభావ సమాసము 2. తత్పురుష సమాసము 3. కర్మ ధారయ సమాసము 4. ద్విగు సమాసము 5. బహువ్రీహి సమాసము 6. ద్వంద్వ సమాసము.

ఈ సమాసములందు గల పదముల; కొన్ని సమాసములందు అన్ని పదములు ప్రధానమై యుండును. మరికొన్నిటియందు ఉత్తరపదము, మరికొన్నియందు అన్యపదములు ప్రాధాన్యత వహించును. వాని ప్రాధాన్యతబట్టియే సమాసమును గుర్తింపవచ్చును.

**1) అవ్యయీభావ సమాసము:** అవ్యయమనగా లింగ వచన విభక్తుల వలన మార్పుచెందనిది. అవ్యయముల రూపములు ఎల్లప్పుడు ఒకే విధముగా నుండును. మార్పు చెందవు. ఔరా, ఆహో, కావున, కాబట్టి మున్నగునవి. ఇది పూర్వపదార్థ ప్రాధాన్యము గలది. మొదటి పదము సాధారణముగా అవ్యయమై యుండును.

ఉదా॥ ప్రతిదినము = దినమున, దినమున (వి.వా.)
నిర్జలము = జలములేని (వి.వా)

ఇట 'ప్రతి' అనునది ప్రతియొకక్క రోజు అని తెలుపుటకై ప్రయోగింపబడినది గాన దీనికి ప్రాధాన్యత గలదు. అటులనే 'నిర్' అనునది జలము లేకపోవుటను తెల్పుచున్నది గాన దానికి ప్రాధాన్యత గలదు. కాని జలమునకు లేదు. 'ప్రతి' 'నిర్' అవ్యయములు ప్రధానములు గాన నిది అవ్యయీభావ సమాసము.

**2) తత్పురుష సమాసము:** ఉత్తర పదార్థ ప్రాధాన్యము తత్పురుష. ఉత్తర పదము అనగా రెండవ పదము. రెండవ పదము యొక్క అర్థమే ప్రధానముగా గలది తత్పురుషము. విగ్రహ వాక్యమునందు విభక్తి ప్రత్యయములను చేర్చి చెప్పునప్పుడు మొదటి పదము చివర ఏ విభక్తి ప్రత్యయము చేరునో ఆ విభక్తి పేరుతో నీ సమాసములు పిలువబడును. ఏ పదము యొక్క అర్థము క్రియతో అన్వయించునో అట్టి పదము యొక్క అర్థమే ప్రధానము. ముందు విభక్తి ప్రత్యయములను నేర్చుకొనవలెను.

| | | |
|---|---|---|
| డు–ము–వు–లు | – | ప్రథమా |
| నిన్, నున్, లన్, కూర్చి, గురించి | – | ద్వితీయా |
| చేతన్, చేన్, తోడన్, తోన్ | – | తృతీయా |
| కొఱకున్, కై | – | చతుర్థీ |
| వలనన్, కంటెన్, పట్టి | – | పంచమీ |

కిన్, కున్, యొక్క, లోన్, లోపలన్ - షష్ఠీ
అందున్, నన్ - సప్తమీ

ఈ తత్పురుష సమాసము మరల రెండు విధములు:

1. వ్యధికరణము 2. సమానాధికరణము.

1. ద్వితీయాది విభక్తులతో కూడిన పదములకు మీది పదము తోడి సమాసము వ్యధికరణము.
2. విశేషణమునకు విశేష్యముతోడి సమాసము సమానాధికరణము. ఇదియే కర్మధారయము.

**వ్యధికరణము-ద్వితీయా తత్పురుష:** దీనియందు మొదటి పదము ద్వితీయావిభక్తి యందుండును.

ఉదా॥ నెలతాలు = నెలను+తాల్పు (వి.వా)

ఇట 'ను' అను ద్వి.వి. ప్రత్యయము చేరి లోపించినది. తృతీయా తత్పురుష – దీనియందు పూర్వపదము తృతీయా విభక్తిలో నుండును.

ఉదా॥ వ్రతసంపన్నుడు = వ్రతముచేత సంపన్నుడు (వి.వా)

**చతుర్థీ తత్పురుష:** ఇందు మొదటి పదము చతుర్థీ విభక్తి యందుండును.

ఉదా॥ హోమధేనువులు = హోమము కొఱకు ధేనువులు.

**పంచమీ తత్పురుష:** ఇందు మొదటి పదము పంచమీ విభక్తిలో నుండును.

ఉదా॥ దొంగభయము = దొంగవలన భయము.

**షష్ఠీ తత్పురుష:** ఇందు మొదటి పదము షష్ఠీ విభక్తిలో నుండును.

ఉదా॥ దేవతార్చన = దేవతలయొక్క అర్చన.

**సప్తమీ తత్పురుష:** ఇందు మొదటి పదము సప్తమీ విభక్తిలో నుండును.

ఉదా॥ మహీదేవుడు = మహియందు దేవుడు.

**నఞ్ తత్పురుష సమాసము:** వ్యతిరేకార్థమునుదెల్పు 'న' ప్రత్యయము మొదటగల సమాసములకు నఞ్ తత్పురుష అని పేరు.

రెండవ పదము అచ్చుతో మొదలయిన 'న' అనునది 'అన్' గా మారును. రెండవ పదము మొదట హల్లు ఉన్నచో 'న' ప్రత్యయము 'అ'గా మారును.

న+అసూయ = అన్+అసూయ = అనసూయ
న+ప్రియము = అ+ప్రియము = అప్రియము

విగ్రహ వాక్యములందు వ్యతిరేకార్థమున కానివాడు, కానిది, కాదు అనునవి వచ్చినను సాధారణముగా నఞ్ తత్పురుష సమాసము లగును.

ఉదా॥ అసదృశులు = సదృశము కానివారు.
అపేయము = పేయము కానిది
(త్రాగుటకు యోగ్యము కానిది)
అశ్రమము = శ్రమ కానిది
అక్షతులు = క్షతులు కానివారు
అకుటిలుడు = కుటిలుడు కానివాడు
అచ్యుతుడు = చ్యుతి లేనివాడు

## కర్మధారయ సమాసము

విశేషణము విశేష్యముతో సమసించుట కర్మధారయము లేక సమానాధికరణము. విశేషణములకు నామవాచకములతోగాని లేదా ఉపమానములకు ఉపమేయములతోగాని సమాసము చేయుట.

ఉదా॥ నల్లకలువ, నల్లదైనటువంటి కలువ. ఇట 'నల్ల' విశేషణము. 'కలువ' నామవాచకము. నామవాచకముల యొక్కయు సర్వనామముల యొక్క గుణములను తెలుపునది విశేషణము.

ఇందలి రకములు ముఖ్యముగా ఏడు గలవు:

1. విశేషణ పూర్వపద కర్మధారయము
2. విశేషణ ఉత్తరపద కర్మధారయము
3. విశేషణ ఉభయపద కర్మధారయము
4. ఉపమాన పూర్వపద కర్మధారయము
5. ఉపమాన ఉత్తరపద కర్మధారయము
6. సంభావన పూర్వపద కర్మధారయము
7. అవధారణ పూర్వపద కర్మధారయము

ముందు విశేషణ విశేష్యము లననేమో తెలిసికొనవలెను.

విశేష్యము లేక నామవాచకము–నామమునుగూర్చి చెప్పునది నామ వాచకము. అనగా మనుష్యుల, జంతువుల, పక్షుల, పట్టణముల పేర్లను తెలుపు పదములు.

ఉదా॥ రాముడు, సీత, గుఱ్ఱము, చిలుక, గోరింక, మగధ, కోసల మున్నగునవి.

ఈ నామవాచకములు నాల్గు విధములు.

1. **సంజ్ఞా నామవాచకము:-** గుర్తు లేక పేరును తెల్పునది.

   ఉదా॥ రాముడు, అయోధ్య, ఆంధ్రదేశము.

2. **జాతి నామవాచకము:-** పర్వతము, నది, వృక్షము.

3. **గుణ నామవాచకము:-** గుణమును గూర్చి తెల్పునది.

   ఉదా॥ ధైర్యము, బాల్యము, చక్కదనము.

4. **క్రియా నామవాచకము:-** చదువు, తిండి, వంట.

**విశేషణములు:-** నామవాచకముయొక్క గుణమును దెల్పును. అనగా వస్తువులయొక్క గుణమును, స్వభావమును తెలియజేయును.

ఉదా॥ నల్లని, ఎర్రని, మంచి, చక్కని, చిక్కని, రెండు, మూడు మున్నగు సంఖ్యా వాచకములను నామవాచకములకు ముందు ప్రయోగించుటచే నవి విశేషణము లగుచున్నవి.

ఉదా॥ రెండు గోవులు, మూడు లోకములు.

1. **విశేషణ పూర్వపద కర్మధారయము:-** ఇందు మొదటి పదము విశేషణము. రెండవ పదము నామవాచకము.

   ఉదా॥ నీలకేశము, మంజుభాషణము, వాలుచూపులు.

ఇందు నీల, మంజు, వాలు అనునవి వరుసగా కేశము, భాషణము, చూపులు అను నామవాచకములకు విశేషణములుగ నున్నవి. ఇవి పూర్వపదములుగ నుండుటచే నివి విశేషణ పూర్వపద కర్మధారయ సమాసములు.

2. **విశేషణోత్తరపద కర్మధారయము:-** ఇందు నామవాచకము మొదటి పదముగానుండి, విశేషణము రెండవ పదముగా అనగా ఉత్తర పదముగా నుండును.

   ఉదా॥ అమరవీరులు, వీరులైన అమరులు (దేవతలు)

   దేశాంతరము = అన్యమైన దేశము

   రూపాంతరము = అన్యమైన (ఇంకొక) రూపము.

ఇట వీరులు, అంతరము అను విశేషణములు నామవాచకములకు ఉత్తరపదములుగా నున్నవి.

3. **విశేషణ ఉభయపద కర్మధారయము:-** కొన్ని యెడల రెండు విశేషణములు కలిసి ఒక సమాసముగా నేర్పడును. ఈ కేవల విశేషణ సమాసమునే విశేషణ ఉభయపద కర్మధారయ మందురు.

ఉదా॥ శీతోష్ణము- శీతమును, ఉష్ణమును, మృదు మధురత్వము - మృదుత్వమును, మధురత్వమును, ధీరోదాత్తుడు - ధీరుడు, ఉదాత్తుడు.

ఇందుగల పదము లన్నియు విశేషణములే. ఒకే సమాసమునందు రెండు విశేషణములు చేరి పూర్వ ఉత్తర పదములుగా నేర్పబడినవి.

4. **ఉపమాన పూర్వపద కర్మధారయము:-** ఇందు ఉపమానము పూర్వపదముగ నుండును. విశేషణ పూర్వపద కర్మధారయము నందు విశేషణము పూర్వపదముగ నుండును. ఇదియే ఈ రెంటికిగల ముఖ్యభేదము. ఇందు ఉపమానము మొదటి పదముగను, ఉపమేయము రెండవ పదముగను ఉండును.

(ఉపమానము అనగా పోల్చదలచుకున్న వస్తువును ఏ వస్తువుతో పోల్చుదుమో ఆ వస్తువు.)

ఉదా॥ చిగురు, కేలు, జుంటి, మోవి.

ఇట చిగురువంటి కేలు (హస్తము), జున్నువంటి మోవి (పెదవి) అని అర్థములు. చేతిని, పెదవిని వర్ణించుటకు చిగురు, జున్ను అనునవి ఉపమానములుగ గ్రహింపబడెను. అవి పూర్వపదములుగా నున్నవిగాన నిది ఉపమాన పూర్వపద కర్మధారయము.

5. **ఉపమాన ఉత్తరపద కర్మధారయము:-** ఇందు ఉపమానము ఉత్తర పదముగా నుండును. ఉపమేయము పూర్వపదము (మొదటి పదము)గా నుండును.

ఉదా॥ చరణ కమలములు, కేలుందమ్మి.

ఇట చరణములు, కేలు అనునవి ఉపమేయములు. అనగా వర్ణింపవలసినవి. ఇవి కమలము, తమ్మి అను ఉపమానములతో పోల్చబడెను. ఈ ఉపమానములు ఉత్తర పదములుగా నున్నవి. కాన నిది ఉపమాన ఉత్తరపద కర్మధారయము.

6. **సంభావన పూర్వపద కర్మధారయము:** సంభావన యనగా సంజ్ఞ లేక గుర్తు. వస్తువులను గుర్తించుటకు వానికేదియో ఒక నామము నిడుదుము. ఆ నామమునకే సంజ్ఞ అందుము. మొదటి పదము సంజ్ఞను లేక గుర్తును తెలుపును. రెండవ పదము నామవాచకమగును.

ఉదా॥ యమునానది (యమున అను పేరుగల నది), ద్వారకానగరము (ద్వారక అను పేరుగల నగరము), వసుదేవ మహారాజు (వసుదేవుడను పేరుగల మహారాజు), వంశీ కుంజము (వెదురుపొద) – వంశీ అను పేరుగల కుంజము.

ఇందు యమున, ద్వారక, వసుదేవ, వంశీ అనునవి ఆయా వస్తువుల యొక్క నామములు. ఇవి పూర్వమందు ప్రయుక్తమగుటచే నివి సంభావన పూర్వపద కర్మధారయములు

ఇట 'పేరుగల' అను పదము వ్యుత్పత్తి యందు ఉపయోగింపబడినది. 'కల' అనునది. వచ్చినదిగాన బహువ్రీహి అని పొరబడరాదు.

## రూపక సమాసము

ఉపమేయమునందు ఉపమానముయొక్క ధర్మము నారోపించుట. ఉపమానమునకు ఉపమేయమునకు అభేదములను చెప్పుట–అనగా వర్ణింపదలచిన వస్తువునందు పోల్చబడిన వస్తువుయొక్క ధర్మమును ఆరోపించుట.

ఉదా॥ వచనామృతము = వచనమనెడి అమృతము.

వచనము – ఉపమేయము – వర్ణింపదలచినది అమృతము – ఉపమానము – పోల్చబడినది.

అమృతమునకు గల ధర్మములు మధురత్వము అస్వాద నీయము, సజీవత్వము.

అటులనే వచనము లేదా వాక్కు కూడా మధురమై శ్రుతిపేయముగ నుండవలెను.

సజీవమై శ్రోతలలో చైతన్యమును కలుగచేయవలెను.

అస్వాదనీయమై మరల వినవలెననెడి కుతూహలమును కలుగజేయవలెను.

ఈ లక్షణము లన్నియు వచనమునకును గలవు గాన అందు అమృతము యొక్క ధర్మము ఆరోపింపబడినది.

ఈ సమాసమునకు విగ్రహవాక్యమునందు సాధారణముగా 'అనెడు' అను పదము వచ్చును.

# ద్వంద్వ సమాసము

ఉభయపద ప్రాధాన్యము ద్వంద్వ సమాసము. అనగా సమాసమునందుగల రెండు పదములయొక్క అర్థమునకు సమానముగా ప్రాధాన్యత ఉండును. వీటికి విగ్రహవాక్యము చెప్పునప్పుడు సముచ్చయార్థకములైన యు, ను అను వర్ణములు చేర్చుట జరుగును.

ఉదా॥ సీతారాములు = సీతయు రాముడును.

ఇట 'సీత' 'రాముడు' అను పదములు రెంటి అర్థమునకు సమానమైన ప్రాధాన్యము గలదు. "సీతారాములు వచ్చిరి" అను వాక్యమున్నచో నిందు సీత యొక్కతెయే వచ్చినదా లేక రాము డొక్కడే వచ్చినాడా? అని ప్రశ్నించుకొనిన, ఇరువురు వచ్చిరనియే సమాధానము లభించును. కాన ఇరువురికి సమ ప్రాధాన్యత గలదు.

అటులనే "సుఖదుఃఖములను భరియింపవలెను" అనినచో ఇచట సుఖమును, దుఃఖమును రెంటిని సమానముగ భరింపవలెననియే అర్థము. ఈ రెండు పదముల అర్థములకు సమ ప్రాధాన్యత గలదు. ఇట్లు రెండు పదములతోడనే ద్వంద్వ సమాస మేర్పడిన దానిని ద్విపద ద్వంద్వ సమాస మందురు.

బహుపద ద్వంద్వ సమాసము:- సమాసమునందు రెండు కంటె ఎక్కువ పదములు సమ ప్రాధాన్యత గల్గియున్నచో నది బహుపద ద్వంద్వ సమాసము.

ఉదా॥ సీతారామలక్ష్మణులు అడవి కేగిరి.

ఇటు సీత ఒక్కతెయే అడవికి పోలేదు. భర్త ననుసరించి వెళ్ళినది. సీతారాములు – ఇరువురే వనవాసమునకు వెడలలేదు. వారిని లక్ష్మణుడు అనుసరించెను. ఇట ముగ్గురును అడవి కేగినవారలే గనుక ముగ్గురిని దెల్పు ఈ మూడు పదములకు సమానమైన ప్రాధాన్యము గలదు.

ఉదా॥ "సత్య ధర్మ శాంతి ప్రేమలు మానవులకు ఆచరణీయములు." – ఇట సత్యము నొక్కదానినేగాని లేదా ధర్మము నొక్కదానినేగాని ఆచరించుట గాదనియు, పై నాల్గింటిని సమముగ నాచరింపవలెనని తెల్పుటయైనది.

గమనిక: ద్వంద్వమును, విశేషణ ఉభయపద కర్మధారయమును గుర్తించుటకు పొరపాటు పడరాదు. ద్వంద్వ సమాసమునందు అన్నీ నామవాచకములే ఉండును.

ఉదా॥ కూరగాయలు (కూరలు, కాయలు)

విశేషణ ఉభయపద కర్మధారయమునందు రెండు విశేషణములు ఉండును.

ఉదా॥ శీతోష్ణములు (శీతలత్వము, ఉష్ణము).

## ద్విగు సమాసము

ఇచటను విశేషణ విశేష్యములతో సమసించును. కాని ఇందు విశేషణము సంఖ్యావాచకమై యుండును. ఉత్తర పదము నామవాచకమగును.

ఉదా॥ నవరత్నములు, వేయిస్తంభములు, చతుర్వేదములు.

వీనిలో నవ, వేయి, చతుర్ అనునవి సంఖ్యావాచకములు, విశేషణములు. రత్నములు, స్తంభములు, వేదములు అనునవి విశేష్యములు, నామవాచకములు.

తొమ్మిదియైన రత్నములు, వేయియైన స్తంభములు, నాల్గుయైన వేదములు అని వ్యుత్పత్తులు సిద్ధించును. అట సంఖ్యావాచకములైన నవ, వేయి, చతుర్ అను విశేషణములు పూర్వపదములుగ నుండుటచే నివి ద్విగు సమాసములైనవి.

కవిత్రయము, లోకత్రయము అను వానియందు త్రయము (మూడు) అను సంఖ్యావాచకము గలదు గాన నివియును ద్విగుసమాసములే అని పొరబడరాదు. ఇట 'త్రయము' అనునది ఉత్తరపదముగా నున్నది. వీనికి విగ్రహవాక్యము చెప్పినచో కవులయొక్క త్రయము, లోకములయొక్క త్రయము అని షష్ఠీతత్పురుష సమాసములగును.

## బహువ్రీహి సమాసము

అన్యపదార్థ ప్రాధాన్యము బహువ్రీహి సమాసము. అన్యము అనగా ఇతరము లేక వేరొకటి. సమాసమునందు ప్రయోగింపబడిన పదముల అర్థము కంటెను వేరొక పదము యొక్క అర్థమే ప్రధానముగా నుండును.

ఉదా॥ ముక్కంటి-మూడు కన్నులు గలవాడు (శివుడు).

ఇట 'మూడు' అను సంఖ్యకు ప్రాధాన్యము లేదు. కన్నులకు ప్రాధాన్యము లేదు. సమాసమునందు ప్రయుక్తమైన ఈ రెండు పదములకు ప్రాధాన్యము లేక మూడు కన్నులు గలవాడు ఎవడో మరొకడు వానికి ప్రాధాన్యము ఇవ్వబడినది. మూడు కన్నులు గల శివుడు ఇట అన్యపదార్థము. ఈ అన్య పదార్థమగు 'శివ' శబ్దము సమాసము నందుండదు. దానిని విగ్రహ వాక్యమునుబట్టి గ్రహింపవలెను.

ఉదా॥ పద్మాలయ = పద్మమే ఆలయము (నివాసము)గా గలది (లక్ష్మి).

ఇట 'పద్మ,' 'ఆలయ' శబ్దములకు ప్రాధాన్యత లేక, దీనిని కల్గియున్న అన్యపదార్థమగు లక్ష్మి శబ్దమునకే ప్రాధాన్యత యున్నది. 'లక్ష్మి' అను పదము సమాసమునందుండదు.

ఈ సమాసములకు విగ్రహ వాక్యములందు సాధారణముగా కలది, కలవాడు వచ్చును.

★ ★ ★

# ఛందస్సు

పద్య లక్షణమును తెలుపు శాస్త్రమునకే ఛందశ్శాస్త్రమని పేరు. గురు, లఘువుల కలయికచే నేర్పడునవి గణములు. ఇటువంటి కొన్ని గణముల కలయికచే నొక పద్య మేర్పడును.

**లఘువులు:** లఘువు ఏకమాత్రా కాలికము. అనగ ఒక మాత్రకాలములో ఉచ్చరింపబడునది. మాత్ర అనగ చిటికె వేయునంత కాలము.

లఘువునకు గుఱుతు – I

1. హ్రస్వాచ్చు లన్నియు లఘువులు.

   ఉదా॥ అ, ఇ, ఉ, ఎ, ఒ

2. హ్రస్వాచ్చులతో గూడిన హల్లులు లఘువులు.

   ఉదా॥ క, చి, టు, తె, పొ మొ॥

3. హ్రస్వమైన ద్విత్వాక్షరములు లఘువులు. ఒక హల్లు అదే హల్లుతో కలియుట ద్విత్వము.

   ఉదా॥ క్క, గ్గి, మ్మ, య్య మొ॥

4. హ్రస్వమైన సంయుక్తాక్షరములు లఘువులు. ఒక హల్లు మరియొక హల్లుతో కలియుట సంయుక్తము.

   ఉదా॥ క్త, స్వ, త్రి, క్ష్మి, ద్మ మొ॥

5. వట్రుసుడి (ృ) గల హ్రస్వాక్షరములు లఘువులు.

   ఉదా॥ కృ, తృ, మృ, పృ, సృ మొ॥

**గురువులు:** ఇవి ద్విమాత్రా కాలికములు, అనగా రెండు మాత్రల కాలములో ఉచ్చరింపబడునవి.

వీని గుఱుతు – U

1. దీర్ఘాచ్చు లన్నియు గురువులు

   ఉదా॥ ఆ, ఈ, ఊ, ఏ, ఓ, ఐ, ఔ

2. దీర్ఘచ్చులతో గూడిన హల్లులన్నియు గురువులు.

ఉదా॥ కా, చీ, టూ, తే, పొ, సై మొ॥

3. పూర్ణబిందువు (నిండుసున్న)తో గూడిన అక్షరములు గురువులు.

ఉదా॥ అం, ఎం, కం, పం, యం మొ॥

4. విసర్గతో గూడిన అక్షరములు గురువులు.

ఉదా॥ అః, దుః, పః, కః మొ॥

5. ద్విత్వాక్షరమునకు ముందున్నవి గురువులు.

ఉదా॥ అక్క, అమ్మ, పువ్వు, చెన్ను, ఉల్లి మొ॥

6. సంయుక్తాక్షరములకు ముందున్నవి గురువులు.

ఉదా॥ రక్త, కుల్య, లక్ష్మి, పద్మ, మొ॥

క్త, ల్య, క్ష్మి, ద్మ అనునవి సంయుక్తాక్షరములు. ఈ హల్లులు అవే హల్లులతో గాక వేరు హల్లులతో సంయోగము చెందినవి. ఉదా॥ 'క్త' యందు 'క్+త్+అ' గలవు. కకారము కకారముతోడగాక వేరుహల్లు అయిన తకారముతో కలిసినది గాన నిది సంయుక్తాక్షరము. ఈ సంయుక్తాక్షరములకు ముందున్న ర, కు, ల, ప అనునవి గురువులు.

7. పొల్లు హల్లుతో గూడిన వర్ణములు గురువులు.

ఉదా॥ కన్, చున్, మత్, దిర్, వచ్ మొ॥

గమనిక: 1. ఒత్తు అక్షరములు గురువులు కావు – లఘువులే.

ఉదా॥ ఖ, ఘ, ఛ, ఝ, థ, ఠ.

2. వట్రుసుడి లేక ఋత్వముతో గూడిన అక్షరములు సంయుక్తములుగావు. ఋ వర్ణము అచ్చుగాన ఇట హల్లుతో కలియుటచే నివి సంయుక్తము లనబడవు. కనుక వీని ముందున్న వర్ణములు గురువులు గావు.

ఉదా॥ 'పితృ' – ఇందు 'పి' గురువుకాదు.

3. సమాసము కానిచోట్ల అనగా విడిగానున్న పదములలో ఒక పదము మొదట వచ్చు ద్విత్వాక్షరమునకు గాని, సంయుక్తాక్షరమునకు గాని ముందున్న యక్షరములు గరువులు గావు, లఘువులే.

ఉదా॥ వాడు ప్రశంసనీయుడు.

ఇట 'ప్ర' అను వర్ణము సంయుక్తాక్షరము. కాని, ఇది సమాసము నందు లేదు. విడి పదముగా నున్నది. కావున దీనికి ముందున్న 'డు' అను అక్షరము గురువు కాజాలదు. లఘువే అగును.

4. 'శుభస్వప్నము' – ఇది సమాసము. కావున ఇందు సంయుక్తాక్షరమగు 'స్వ' వర్ణమునకు ముందు 'భ' అను అక్షరము గురువేయగును. ఇట శుభ–స్వప్నము అనునవి రెండు వేఱువేఱు పదములుగా లెక్కింపరాదు.

5. అద్రుచు, విద్రుచు, ఎద్రుచు, పద్రుచు, చిద్రుప, కద్రువ, రుద్రుడు మొ॥ పదములందరి 'ద్రు' అను సంయుక్తాక్షరమునకు ముందు గల అ, వి, ఎ, ప, చి, క, రు అనునవి గురువులు కావు – లఘువులే అగును.

అక్షరములు లెక్కించునపుడు అర్ధబిందువు [c], పూర్ణబిందువు [ం], విసర్గ [ః] లను; క్, చ్, ల్, న్ మున్నగు పొల్లు హల్లులను వేరు అక్షరములుగా భావింపరాదు. ఇవి అచ్చులతోను హల్లులతోను కలిసియే యుండును. కనుక వీటికి వెనుకనున్న అక్షరములతో కలిపి దీనిని ఒక అక్షరముగ పరిగణింపవలెను.

7. పద్య పాదమును గణ విభజన చేసిన పిమ్మట చివర లఘువు వచ్చినచో రెండవ పాదమును పరిశీలించి చూడవలెను. రెండవ పాదము మొదట ద్విత్వాక్షరముగాని, సంయుక్తాక్షరముగాని యున్నచో మొదటి పాదము చివరనున్న లఘువు గురువగును.

గురువును 'గ' అనియు, లఘువును 'ల' అనియు పిలుతురు. గలము అనగా ఒక గురువు ఒక లఘువు (UI), లగము అనగా ఒక లఘువు, ఒక గురువు (IU)

ఈ క్రిందివానియందు కేవలము గురు, లఘువులను మాత్రమే విభజించుటయైనది.

U UI I
శ్రీ కృ ష్ణ డు

ఉదా॥ శ్రీకృష్ణుడు – ఇట శ్రీ అనునది దీర్ఘాక్షరముగాన గురువైనది. దాని తరువాత నున్న 'కృ' అనునది లఘువే అనవలెను. ఏలనన, వట్రుసుడితో కూడుకొనినవి సంయుక్తాక్షరములు కావు. 'ఋ' కారము అచ్చుయే యగును. కాని, దానికి తరువాత నున్న 'ష్ణ' అనునది సంయుక్తాక్షరము గాన, సంయుక్తాక్షరమునకు ముందున్న వర్ణము గురు వగును. కావున 'కృ' అనునది గురువైనది. ష్ణ అను వర్ణము లఘు వయినది. 'డు' హ్రస్వాక్షరముగాన లఘు వయినది.

UU UI IUI UIII UU UIU UI U
శా. తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్ నీవు నా
UU UII UI UIIIU UUI UUI U
యుల్లం బందున నిల్చి జృంభణముగా యుక్తుల్ సుశబ్దంబు శో
UU UII UI UIII UUUI UUIU
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
UUUI IUIU IIIU UUI UUIU
ఫుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ పూర్ణేందు బింబాననా

ఇందు పొల్లుహల్లుతో గూడినవియగు, తన్, తిన్, క్తుల్ అనునవి గురువులు. రెండవ పాదములో నున్న 'జృం' అనునది గురువైనది. వట్రుసుడితో గూడిన యక్షరము లఘువేయైనను పూర్ణబిందువుతో గూడిన అక్షరముగాన గురువైనది. వత్తు అక్షరమగు 'భి' అనునది మూడవ పాదము మొదట నున్నది. ఇది లఘువే అగును. కాని, వానిలో తరువాత సంయుక్తాక్షరముండుటచే గురువైనది.

## గణవిభజనము

గణములు ముఖ్యముగా రెండు రకములు: 1.నిసర్గ గణములు, 2. ఉపగణములు. నిసర్గ గణములను రెండు అక్షరములతో గూడినవి, మూడు అక్షరములతో గూడినవి అని మరల రెండు విభాగములు చేయవచ్చును. ఉపగణములు సూర్యగణములు, ఇంద్రగణములు, చంద్రగణములని మూడు రకములు. మనకు చంద్రగణములు ప్రస్తుతము అవసరము లేదు.

నిసర్గ గణములు:- లల=I I, లగ=I U, గగ=U U, గల=U I. ఇవి రెండక్షరములతో గూడినవి. 'హ' అను గణము గలము=UI 'వ' అను గణము లగము=IU.

### మూడక్షర గణములు లేక వృత్త గణములు

1. భ గణము U I I రాముడు ఆది గురువు భ గణము
2. జ గణము I U I సరోజ మధ్య గురువు జ గణము
3. స గణము I I U కమలా అంత్య గురువు స గణము
4. య గణము I U U సమీరం ఆది లఘువు య గణము

5. ర గణము UIU భారతం మధ్య లఘువు ర గణము
6. త గణము UUI మున్నీరు అంత్య లఘువు త గణము
7. మ గణము UUU సావిత్రీ మూడు గురువులు మ గణము
8. న గణము III నలుడు మూడు లఘువులు న గణము

ఈ గణములను సులభముగ గుర్తుంచుకొనుటకు ఒక పద్యము గలదు. దానిని కంఠస్థము చేయవచ్చును.

తే॥గీ॥ "ఆదిమధ్యాంత గురువులై అమరు భ. జ, స
లాది మధ్యాంత లఘువులై య, ర, త, లుండు
మగణమన్నిట గురువులై నెగడియుండు
నగణమన్నిట లఘువులై తగ చెలంగు."

మరియొక పద్ధతియు గలదు. ఒక సూత్రమును గుర్తుంచుకొనవలెను.

| య | మా | తా | రా | జ | భా | న | స | ల | గం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| I | U | U | U | I | U | I | I | I | U |

మనకు ఏ గణము కావలెనో ఆ గణము మొదటి అక్షరము నుండి మూడవ అక్షరము వరకు గురు లఘువులను నిర్ణయించుకొని చూడవలెను.

U U I

ఉదాహరణకు 'త' గణము కావలెననిన – తా రా జ అను మూడు అక్షరములను తీసికొనవలెను. రెండు గురువులు, ఒక లఘువు (అంత్యలఘువు) త గణము కావున సరిపోయినది.

**ఉప గణములు:-** సూర్య గణములను, ఇంద్ర గణములను ఉపగణము లందురు.

**సూర్యగణములు:-** ఇవి రెండు, హ గణము–U I, న గణము–I I I.

**ఇంద్రగణములు:-** ఇవి ఆరు. న ల–I I I I

నగ–IIIU, సల–IIUI, భ–U I I

ర–U I U, త–U U I. (నల, నగ, సల, భ, ర, త).

## యతి ప్రాసలు

**యతి:-** ఒక పద్యమునందలి పాదముయొక్క మొదటి అక్షరముతో అదే పాదమునందు–నిర్ణయింపబడిన స్థానమునందున్న అక్షరము–మైత్రి కలిగియుండుట యతి మైత్రి.

ఉదాహరణమునకు ఉత్పలమాల యందు పదియవ అక్షరము యతి కావున మొదటి అక్షరము 'క' అను హల్లయ్యైనచో పదియవ అక్షరము 'క' అను హల్లు గలదియ్యై యుండవలెను.

ప్రాసయతి:- ఉపజాతులందు ఒక పాదమునందలి మొదటి అక్షరమునకు, రెండవ అక్షరమునకు అనగా ప్రాసాక్షరమునకు ఆ పద్యమునందలి నిర్ణయింపబడిన యతి స్థానమునందలి అక్షరమునకు తరువాత నున్న అక్షరముతో మైత్రి గల్గియుండుట.

యతికి విరతి, విశ్రాంతి, విశ్రామము, విరామము, విశ్రమము, వళి అను పేర్లు గలవు. పాదము మొదటనున్న అక్షరమేగాక దానితో మైత్రిగలిగిన మరియొక అక్షరమును యతి స్థానమందుండవచ్చును.

## యతి మైత్రిగల అచ్చులు, హల్లులు

1. అ, ఆ, ఐ, ఔ
2. ఇ, ఈ, ఎ, ఏ, ఋ, ౠ (ృ)
3. ఉ, ఊ, ఒ, ఓ
4. క, ఖ, గ, ఘ
5. చ, ఛ, జ, ఝ, శ, ష, స
6. ట, ఠ, డ, ఢ
7. త, థ, ద, ధ
8. ప, ఫ, బ, భ, వ
9. న, ణ, జ్ఞ
10. ల, డ, ళ
11. ర, ఱ, ల
12. ము, పు, బు, భు
13. అ, య, హ
14. ంట, ంఠ, ండ, ంఢ, ంత, ంథ, ంద, ంధ, న
15. ంప, ంఫ, ంబ, ంభ, మ

ప్రాసమైత్రి:-

1. ఒక పద్యమునందున్న ప్రతి పాదమునందలి రెండవ అక్షరమునకు ప్రాస అని పేరు.
2. పద్యమునందలి నాల్గు పాదములందు ఒకే అక్షరము ప్రాసాక్షరమై యుండవలెను.
3. ప్రాసాక్షరము హ్రస్వమైన అన్ని పాదములందును అదే అక్షరము హ్రస్వముగను, దీర్ఘమైన అన్ని పాదములందు అదే అక్షరము దీర్ఘముగను ఉండవలెను.
4. ప్రాసాక్షరము ద్విత్వమైన అన్ని పాదములందు అదే అక్షరము ద్విత్వముగను, సంయుక్తమైన అన్ని పాదములందు అదే అక్షరము సంయుక్తముగను ఉండును.
5. ప్రాసాక్షరము పూర్ణ బిందువుతో గూడిన అన్ని పాదములందును అదే అక్షరము పూర్ణ బిందువుతోడనే ఉండవలెను.
6. వృత్తమునకు, జాతులకు ప్రాస నియమము గలదు. ఉపజాతులకు ప్రాస నియమము లేదు.

## పద్యభేదములు

వృత్తములు, జాతులు, ఉపజాతులు అని పద్యములు మూడు విధములు.

1. **వృత్తములు:-** నిసర్గ గణములచే నేర్పడును. నాలుగు పాదములుండును. యతిప్రాస లుండును.

   ఉదా॥ ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము, శార్దూలము.

2. **జాతులు:-** మాత్రాగణములచేగాని ఉపగణములచేగాని ఏర్పడును. యతిప్రాస లుండును. మొదటిపాదము నందలి మొదటి వర్ణము గురువైన తక్కిన పాదములందలి మొదటి వర్ణమును గురువే అగును. లఘువైన లఘువే అగును.

   ఉదా॥ కందము, ద్విపద, తరువోజ, ఉత్సాహము.

3. **ఉపజాతులు:-** ఉపగణములచే నేర్పడును. యతి నియమము గలదుగాని ప్రాస నియమము లేదు. ప్రాసయతి యుండవచ్చును. జాతులందువలె ప్రథమవర్ణ నియమము లేదు.

   ఉదా॥ ఆటవెలది, తేటగీతి, సీసము.

# వృత్తములు

| పేరు | గణములు | యతిస్థానము | ప్రతిపాదమందలి అక్షరముల సంఖ్య |
|---|---|---|---|
| 1. ఉత్పలమాల | భరనభభరవ | 10 | 20 |
| 2. చంపకమాల | నజభజజజర | 11 | 21 |
| 3. శార్దూలము | మసజసతతగ | 13 | 19 |
| 4. మత్తేభము | సభరనమయవ | 14 | 20 |
| 5. మత్తకోకిలము | రసజజభర | 11 | 18 |
| 6. తరళము | సభరసజజగ | 12 | 19 |
| 7. పంచచామరము | జరజరజగ | 10 | 16 |
| 8. మాలిని | ననమయయ | 9 | 15 |
| 9. మానిని | భభభభభభభగ | 13 | 22 |
| 10. స్రగ్ధర | మరభనయయయ | 8, 15 | 21 |
| 11. మహాస్రగ్ధర | సతతనసరరగ | 9, 16 | 22 |
| 12. కవిరాజ విరాజితము | నజజజజజజవ | 12 | 23 |

**ఉత్పలమాల:-** ప్రతి పాదమునందును భ–ర–న–భ–భ–ర–వ అను గణములు వరుసగా నుండవలెను. 10 వ అక్షరము యతి స్థానము. ప్రాస నియమము గలదు. నాల్గు పాదములుండును.

| భ | ర | న | భ | | | |
|---|---|---|---|---|---|---|
| U I I | U I U | I I I | U I I | | | |
| క్ష్మారము | ణుండు సే | యతగు | మన్నన | | | |
| | | భ | ర | వ | | |
| | | U I I | U I I | I U | | |
| | | తెల్లద | లంచిచూ | చినన్ | | |

20 అక్షరములు గలవు. 'క్ష్మా'లోని 'మ'కు పదవ అక్షరమగు 'మ'కు యతి చెల్లినది.

**చంపకమాల:-** ప్రతి పాదమునందును న–జ–భ–జ–జ–జ–ర అను గణములు వరుసగా నుండును. 11 వ అక్షరము యతి స్థానము. ప్రాస నియమము గలదు. నాల్గు పాదములుండును.

| న | జ | భ | జ | | |
|---|---|---|---|---|---|
| III | IUI | UII | IUI | | |
| మనము | నసంత | సిల్లను | మమాన | | |
| | | జ | జ | ర | |
| | | IUI | IUI | UIU | |
| | | ముదక్కు_ | మనుజ్ఞ | యిచ్చితిన్ | |

మొదటి అక్షరమగు 'మ' కు 11 వ అక్షరమగు 'మా'కు యతి చెల్లినది. 21 అక్షరములు గలవు.

**మత్తేభము:-** ప్రతి పదమునందును స-భ-ర-న-మ-య-వ అను గణములు వరుసగా నుండును. 14 వ అక్షరము యతి స్థానము. ప్రాస నియమము గలదు. నాల్గు పాదము లుండును.

| న | భ | ర | న | |
|---|---|---|---|---|
| IIU | UII | UIU | III | |
| మతిలో | కోత్తరు | డైనయం | గిరసు | |
| | | మ | య | వ |
| | | UUU | IUU | IU |
| | | మన్మండా | శ్రితుండా | బృహస్ప |

మొదటి అక్షరమగు 'మ'కు 14వ అక్షరమగు 'న్మ' యందలి 'మ' కారమునకు యతి చెల్లినది. 'డై' అను అక్షరమునందలి ఐ కారము దీర్ఘాచ్చు గనుక గురువైనది. 'న్మ' అనునది సంయుక్తాక్షరమైనను పూర్ణబిందువుతో నుండుటచే గురువైనది.

**శార్దూలము:-** ప్రతి పాదమునందును మ-స-జ-స-త-త-గ అను గణములు వరుసగా నుండవలెను. 13 వ అక్షరము యతి స్థానము ప్రాస నియమము గలదు. నాల్గు పాదము లుండును.

| మ | స | జ | స | |
|---|---|---|---|---|
| UUU | IIU | IUI | IIU | |
| దైవాధీ | నముస | ర్వమున్మ | నమతిం | |
| | | త | త | గ |
| | | UUI | UUI | U |
| | | దప్పింప | గావచ్చు | వే |

19 అక్షరము లుండును. 'దై'కిని 13వ అక్షరమగు 'ద'కు యతి చెల్లినది.

**మత్తకోకిల:-** ప్రతి పాదమునందును ర–స–జ–జ–భ–ర అను గణములు వరుసగా నుండును.

11 వ అక్షరము యతిస్థానము. ప్రాస నియమము గలదు. నాల్గు పాదము లుండును.

| | ర | స | జ | జ | భ | ర |
|---|---|---|---|---|---|---|
| | UIU | IIU | IUI | IUI | UII | UIU |
| ఉదా॥ | ఏలపా | ర్థపరా | క్రమంబు | సహింప | నాతని | నాహవ |

మొదటి అక్షరమగు 'ఏ'నకు 11 వ అక్షరమగు 'హి' నందలి ఇకారమునకు అచ్చు మైత్రి చెల్లినది.

| ర | స | జ | జ | భ | ర |
|---|---|---|---|---|---|
| UIU | IIU | IUI | IUI | UII | UIU |
| ఆవహం | బుగమ | త్తకోకి | లయంద్రు | దీనిఁగ | వీశ్వరుల్ |

**పంచచామరము:-** ప్రతి పాదమునందును జ–ర–జ–ర–జ–గ అను గణములు వరుసగా నుండవలయును. 10వ అక్షరము యతి స్థానము. ప్రాస నియమము గలదు. నాల్గు పాదములుండును.

| జ | ర | జ | ర | జ | గ |
|---|---|---|---|---|---|
| IUI | UIU | IUI | UIU | IUI | U |
| పరాత్ప | రుండుమా | ధవుండు | పంచచా | మరంబ | నన్ |

| జ | ర | జ | ర | జ | గ |
|---|---|---|---|---|---|
| IUI | UIU | IUI | UIU | IUI | U |
| కిరాత | రాతలం | పుహత్తి | కేవలం | బుభక్తి | మై |

'మై' అను నక్షరము గురువు. ఏలనన, ఐ, ఔ, లు దీర్ఘాచ్చులు గాన గురువులు.

**తరళము:-** ప్రతి పాదమునందును న–భ–ర–స–జ–జ–గ అను గణములు వరుసగా నుండవలెను. 12వ అక్షరము యతిస్థానము. ప్రాస నియమము గలదు. నాల్గు పాదము లుండును.

| న | భ | ర | స | జ | జ | గ |
|---|---|---|---|---|---|---|
| III | UII | UIU | IIU | IUI | IUI | U |
| ఇదిసొ | రంగన | సాధ్యమె | వ్వరికిం | దువంశ | వరేణ్య | వి/న్మ |

| న | భ | ర | స | జ | జ | గ |
|---|---|---|---|---|---|---|
| III | UII | UIU | IIU | IUI | IUI | U |
| ధరణి | లోగల | రాజులె | ల్లనుదా | రుణక్ష | యకాల | సా |

**మాలిని:-** ప్రతి పాదమునందును న-న-మ-య-య అను గణములు వరుసగా నుండును. 9 వ అక్షరము యతి. నాల్గు పాదము లుండును.

| న | న | మ | య | య |
|---|---|---|---|---|
| III | III | UUU | IUU | IUU |
| నరున | కుదన | నిట్లానం | దమొందిం | చియింద్రుం |

**మానిని:** ప్రతి పాదమునందు భ, భ, భ, భ, భ, భ, భ, గ అను గణము లుండును. 22 అక్షరము లుండును. ప్రాస నియమము గలదు. 7, 13, 19 అక్షరములకు మొదటి అక్షరముతో యతి చెల్లును.

| భ | భ | భ | భ | భ | భ | భ | గ |
|---|---|---|---|---|---|---|---|
| UII | UII | UII | UII | UII | UII | UII | U |
| కారక | ముల్ క్రియ | గన్గొన | నేడుభ | కారము | లొక్కగ | కారము | తో |

## జాతులు

**తరువోజ:-** పాదాదిని లఘువున్న లఘువు. గరువున్న గురువు తక్కిన పాదములం దుండవలెను. ప్రతి పాదము నందును 3 ఇంద్రగణములు, 1 సూర్యగణము, ఆ పైని మరల 3 ఇంద్రగణములు, 1 సూర్యగణము మొత్తము ఎనిమిది గణము లుండును. 1, 3, 5, 7 గణముల మొదటి అక్షరము యతి చెల్లును.

| నల | నల | భ | న |
|---|---|---|---|
| IIII | IIII | UII | III |
| అనిమిష | ప్రభుడని | జాత్మజ | ననఘ |
| భ | ర | సల | హ |
| UII | UIU | IIUI | UI |
| నర్జును | ప్రీతితో | నభిషిక్తు | జేసి |

**మధ్యాక్కర:-** ప్రతి పాదమునందు రెండింద్ర గణములు ఒక సూర్యగణము, ఆపైని మరల రెండింద్రగణములు, ఒక సూర్యగణము

మొత్తము ఆరు గణము లుండును. మొదటి అక్షరమునకును, 4 వ గణము మొదటి అక్షరమునకు యతి చెల్లును. నన్నయ మాత్రము 5వ గణము మొదటి అక్షరమునకు యతి వాడెను.

| భ | భ | న | నల | నగ | హ |
|---|---|---|---|---|---|
| U I I | U I I | I I I | I I I I | I I I U | U I |
| ద్వాదశి | మాసిక | వ్రతము | సలుపుదు | దురుణిమా | యున్న |

**ఉత్సాహ:** పాదాదిని గురువున్న గురువు, లఘువున్న లఘువు తక్కిన పాదములందును ఉండవలెను. 7 సూర్యగణములు ఆపైని ఒక్క గురువు ఉండును. 1, 5 గణముల మొదటి అక్షరములకు యతి చెల్లును.

| న | హ | హ | హ | హ | హ | హ | గ |
|---|---|---|---|---|---|---|---|
| I I I | U I | U I | U I | U I | U I | U I | U I |
| చిరము | నీశ | హృద | యేశ | చిత్ర | కాశ | రూప | వి/స్తు |

**ద్విపద:-** (1) దీనికి రెండు పాదములే యుండునని దీని పేరును బట్టి తెలిసికొనవచ్చును. (2) ప్రతి పాదమునందు 3 ఇంద్రగణములు ఆపైని 1 సూర్యగణము ఉండును. (3) మొదటి గణము యొక్క మొదటి అక్షరమునకు, 3 వ గణము మొదటి అక్షరమునకు యతి చెల్లును. (4) దీనికి ప్రాసయుండును. (5) పథమవర్ణ నియమము గలదు. అనగా మొదటి పాదమునందు మొదటి అక్షరము గురువైన తక్కిన పాదములందును అట్లే యుండవలెను. లఘువైన తక్కిన పాదములందు లఘువే యుండవలెను.

దీని లక్షణములు గుర్తుంచుకొనుటకు ఈ క్రింది పద్యమును కంఠస్థము చేయవచ్చును.

| భ | నగ | నగ | న |
|---|---|---|---|
| U I I | I I I U | I I I U | I I I |
| ఇంద్రగ | ణములుమూ | డినగణం | బొకటి |
| త | నల | సల | హ |
| U U I | I I I I | I I U I | U I |
| చంద్రాస్య | ద్విపదకు | జనుజెప్ప | రేచ |

మరియొక ఉదాహరణము:

| | | | |
|---|---|---|---|
| సల | సల | నగ | హ |
| IIUI | IIUI | IIIU | UI |
| తొలికోడి | కనువిచ్చి | నిలిచిమై | వెంచి |
| నల | భ | సల | హ |
| IIII | UII | IIUI | UI |
| జలజల | తెక్కల | సడలించి | నీలి |

**మంజరీద్విపద:** ద్విపద లక్షణములే దీనికిని గలవు. భేదమేమనిన, ఇందు ఏ పాదమున కాపాదము విడివిడిగ నుండవలెను. అనగా ఒకే శబ్దము రెండు పాదముల కంటుకొని యుండరాదు.

| | | | |
|---|---|---|---|
| ర | ర | సల | హ |
| UIU | UIU | IIUI | UI |
| పారసీ | కక్ష్యలో | పలగూరు | చుండ |
| సల | త | త | హ |
| IIUI | UUI | UUI | UI |
| నదిసూచి | నాసంస్కృ | తాధ్యాప | కుండు |

ఇందు మొదటి పాదము 'కూరుచుండ' అను పదముతో అంతమై విడిగా నున్నది. పిమ్మట 'అదిసూచి' అని రెండవ పాదము విడిగా మొదలయినది.

**కందము:**

1. ఇందు నాల్గు పాదము లుండును. మొదటి రెండు పాదములకు పూర్వార్ధమనియు, చివరి రెండు పాదములకు ఉత్తరార్ధమనియు పేరు.
2. ఇందు నాలుగు మాత్రల గణము లుండును.
3. గగ, భ, జ, స, నల అను గణములను మాత్రమే ఉపయోగించవలెను. ఇవి వరుసగా నుండవలెనను నియమము లేదు. ఎక్కడైన నేవియైన నుండవచ్చును. గగ అనగా రెండు గురువులు. దీనినే 'గా' అనియు అందురు.

4. 1, 3 పాదములందు 3 గణములను, 2, 4 పాదములందు 5 గణములును ఉండును. అనగా పూర్వార్ధమందు 8 గణములు, ఉత్తరార్ధమందు ఎనిమిది గణములు ఉండును.

5. బేసిని జగణ ముండరాదు. అనగా 1, 3, 5, 7 గణములు జగణము కారాదు.

6. ఆరవ గణము అనగా 2, 4 పాదములలోని మూడవ గణము జగణముగాని నలముగానియై యుండవలెను.

7. 2, 4 పాదములలో చివరి గణమున – తుది గురువుండు గగముగాని సగణముగాని యుండవలెను.

8. 1, 3 పాదములకు యతి లేదు. 2, 4 పాదములలో మొదటి వర్ణమునకు 4 వ గణము మొదటి వర్ణమునకు యతి చెల్లును.

9. దీనికి ప్రాస నియమము గలదు.

10. ప్రథమ వర్ణ నియమము గలదు. మొదటి పాదము నందలి మొదటి అక్షరము గురు లఘువులలో నేదియైన తక్కిన పాదములందు మొదటి అక్షరము అదియేయై యుండవలెను.

ఈ లక్షణములను గుర్తించుకొనుటకు ఈ క్రింది కంద పద్యము గలదు:

| | | | | | |
|---|---|---|---|---|---|
| | భ | నల | భ | | |
| కం॥ | U I I | I I I I | U I I | | |
| | కందము | త్రిశరక | ణంబుల | | |
| | భ | భ | నల | సల | గగ |
| | U I I | U I I | I I I I | I I U I | U U |
| | నందము | గాభజ | సనలము | లటవీడి | మూటన్ |
| | భ | నల | భ | | |
| | U I I | I I I I | U I I | | |
| | బొందును | నలజల | నాటట | | |
| | గగ | నల | నల | భ | గగ |
| | U U | I I I I | I I I I | U I I | U U |
| | నొందుం | దుదగురు | పుజగణ | ముండదు | బేసిన్ |

# ఉపజాతులు

**సీసము:-**

1. ప్రతి పాదమునందు 6 ఇంద్రగణములు, ఆ పైని 2 సూర్యగణములు ఉండవలెను.
2. మొత్తము పాదమున ఎనిమిది గణముల చొప్పున నాలుగు పాదములుండును.
3. ఇవి పెద్ద పాదములు కావున రెండు యతులుండును. మొదటి గణము మొదటి అక్షరమునకు 3 వ గణము మొదటి అక్షరమునకు ఒక యతి. మరల 5 వ గణము మొదటి అక్షరమునకు 7 వ గణము మొదటి అక్షరమునకు ఒక యతి.
4. యతికి బదులుగ ప్రాసయతి ఉండవచ్చును.
5. ప్రాస నియమము లేదు.
6. పెద్ద పాదములు నాల్గు తరువాత ఒక ఆటవెలది గాని, తేటగీతి గాని యుండవలెను.

ఈ లక్షణములను గుర్తుంచుకొనుటకీ క్రింది పద్యము గలదు:

*సీ॥ ఇంద్రగణములాఱు నిన గణంబులు రెండు*
*పాదపాదమునను బరగుచుండు*
*ఆటవెలదియైనఁ దేటగీతియునైనఁ*
*జెప్పవలయు మీఁద సీసములకుఁ*

| | | | |
|---|---|---|---|
| త | సల | త | సల |
| U U I | I I U I | U U I | I I U I |
| మందార | మకరంద | మాధుర్య | మున్మగ్రోలు |
| సల | ర | వ | వ |
| I I U I | U I U | I I I | I I I |
| మధుపంబు | వోవునే | మదన | ములకు |

**తేటగీతి:-**

1. ఇందు నాల్గు పాదము లుండును.
2. ప్రతిపాదమునందు మొదట 1 సూర్యగణము, పిదప 2 ఇంద్ర గణములు, మరల 2 సూర్య గణములు ఉండును.

3. మొదటి గణము యొక్క మొదటి అక్షరమునకు నాల్గవ గణముయొక్క మొదటి అక్షరమునకు యతి చెల్లును.
4. ప్రాసయతి వేయవచ్చును.
5. ప్రాసనియమము లేదు.

ఈ క్రింది పద్యమునందు లక్షణములు గలవు:

*సూర్యు డొక్కరుండు సురరాజు లిద్దఱు*
*దినకర ద్వయంబు తేటగీతి*

| హ | త | నగ | హ | హ |
|---|---|---|---|---|
| UI | U U I | I I I U | U I | U I |
| చేతు | లారంగ | శివునిబూ | జింప | డేని |
| హ | త | సల | స | హ |
| U I | U U I | I I U I | I I I | U I |
| నోరు | నొవ్వంగ | హరికీర్తి | నుడువ | డేని |

**ఆటవెలది:**

1. ఇందు నాల్గు పాదము లుండును.
2. 1, 3 పాదములందు వరుసగా 3 సూర్యగణములు, ఆ తరువాత 2 ఇంద్రగణములు ఉండును.
3. 2, 4 పాదములందు వరుసగా 5 సూర్యగణములుండును.
4. మొదటి గణము మొదటి అక్షరమునకు, 4 వ గణము మొదటి అక్షరమునకు యతి చెల్లును.
5. ప్రాసయతియు చెల్లును.
6. ప్రాసనియమము లేదు.

ఈ క్రింది పద్యమునందు లక్షణములు గలవు:

| న | హ | హ | త | భ |
|---|---|---|---|---|
| I I I | U I | U I | U U I | U I I |
| ఇనగ | ణత్ర | యంబు | నింద్రద్వ | యంబును |
| హ | హ | హ | హ | న |
| U I | U I | U I | U I | I I I |
| హంస | పంచ | కంబు | నాట | వెలది |

| | | | | |
|---|---|---|---|---|
| హ | హ | హ | ర | సల |
| U I | U I | U I | U I U | I I I U |
| ఉప్పొ | కప్పొ | రంబు | నొక్కపో | లికనుండు |
| హ | హ | న | హ | హ |
| U I | U I | I I I | U I | U I |
| జూడఁ | జూడ | రుచుల | జూడ | వేరు |

## ఏ పద్యపాదమో కనుగొను విధము

1. మొదట పద్యపాదమును వరుసగా గురు లఘువుల విభాగము చేయవలెను.
2. పాదము చివర గురువున్న యెడల అది కందముగాని వృత్తముగాని అగును.
3. వృత్తములలో పాదముల సంఖ్య 19 అక్షరముల నుండి 21 అక్షరముల వఱకు ఉండును.
4. చివర గురువుండి 18 అక్షరముల కంటె తక్కువ ఉన్నను, 21 అక్షరములకంటె ఎక్కువ ఉన్నను తప్పక కందమే అగును.
5. చివర గురువుండి 19 నుండి 21 వరకు అక్షరములున్న వృత్తమే అగును. అది ఏ వృత్తమో కనుగొనవలెననిన–
   ఎ) పాదము మొదట 1 గురువు 2 లఘువులు 1 గురువు వరసగానున్న అది ఉత్పలమాల. పాదమునందు 20 అక్షరములు లుండును. 10 వ అక్షరము యతిస్థానము.
   బి) పాదము మొదట 4 లఘువులపై 1 గురువు వరుసగా నున్న అది చంపకమాల. పాదమునందు 21 అక్షరము లుండును. 11 వ అక్షరము యతిస్థానము.
   సి) పాదము మొదట వరుసగా 3 గురువులుండి ఆపై 2 లఘువులున్న అది శార్దూలము. పాదమునందు 19 అక్షరము లుండును. 13 వ అక్షరము యతిస్థానము.
   డి) పాదము మొదట 12 లఘువులు 2 గురువులు మరల 2 లఘువులు వరుసగా నున్న అది మత్తేభము. పాదమునందు 20 అక్షరము లుండును. 14 వ అక్షరము యతిస్థానము.

ఇ) పాదము మొదట 3 లఘువులు 1 గురువు 2 లఘువులు వరుసగా నున్న అది తరలము ( నభరసజజగ). పాదమునందు 14 అక్షరము లుండును 12 వ అక్షరము యతిస్థానము.

ఎఫ్) పాదమునందు 1 గురువు 1 లఘువు 1 గురువు 2 లఘువులు వరుసగానున్న మత్తకోకిలము (రసజజభర,) పాదమునందు 18 అక్షరము లుండును 11వ అక్షరము యతిస్థానము.

6) పాదము చివర లఘువున్న యెడల తేటగీతి, ఆటవెలది, సీసము, ద్విపదలలో ఏదియో ఒకటి అగును.

★ ★ ★

# అలంకారములు

కావ్యమునకు శోభను గూర్చునవి అలంకారములు. శబ్దశోభను గల్గించునవి శబ్దాలంకారములు. అనుప్రాసాదులు శబ్దాలంకారములని అలంకారికులనిరి. అర్థము నపేక్షింపక శబ్దమును మాత్రము ఆశ్రయించిన శబ్దాలంకారము.

## శబ్దాలంకారములు

**అనుప్రాసాలంకారములు:** రసానుగతమగు ప్రకృష్టమగు వర్ణ విన్యాసము అనుప్రాసము. అనుప్రాసము అనుటచే ప్రాసాక్షర నియమమును, ప్రాసపూర్వ నియమము ఉండవలెనని తెలియుచున్నది.

1. **వృత్త్యనుప్రాసము:** ఒకే హల్లు పలుమారులు అవృత్తియగుట. అనగా ముందు గ్రహింపబడిన హల్లు మరల మరల వచ్చుచుండుట. లేదా మధ్యలో వచ్చిన హల్లు కూడ మరల మరల రావచ్చును. దీనినే ఆంగ్లమందు "Alliteration" అందురు.

ఉదా॥ 1. అమందానంద కందళిత హృదయారవిందుడు.

ఇందు పూర్ణబిందు పూర్వక దకారము (ంద) నాలుగు మార్లు అవృత్తియైనది.

ఉదా॥ 2. వివక్ష శిక్షణ విచక్షణ

ఇందు క్ష కారము మూడుసార్లు వచ్చినది.

ఉదా॥ 3. మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు వోవునే మదనములకు

ఇందు మ కారము నాల్గుమార్లు వచ్చినది.

ఉదా॥ 4. విష్ణురోచిష్ణు జిష్ణు సహిష్ణు గృష్ణు.

2. లాటానుప్రాసము:- తాత్పర్యభేదముచే నొక శబ్దము పలుమాఱులు అవృత్తి యగుట.

వివరణము: అర్థభేదము లేకున్నను తాత్పర్య భేదము గల్గునట్లు ఒకే శబ్దము రెండుమార్లు అవ్యవహితముగ (వేరుకాకుండ) అవృత్తి నొందుట.

లాటదేశస్థులకు ప్రియమైనది గాన నిది లాటానుప్రాసమైనది. నేటి గుజరాతులోని మధ్య దక్షిణ ప్రాంతములు పూర్వము లాటదేశమని పిలువబడెడివి. ఆ దేశీయులకీ అలంకారము మిక్కిలి ఇష్టము, కావున ఆ దేశము పేరిట నిది పిలువబడినదని పండితాభిప్రాయము.

ఉదా॥ కమలాక్షు నర్చించు కరములు కరములు

సమన్వయము:- ఇట 'కరములు' అను పదము రెండుమారులు వెంట వెంటనే ప్రయోగింపబడినది. ఇందు అర్థభేదము లేదు. కరములనిన 'చేతులు' అనియే అర్థము కాని తాత్పర్యమునందు భేదము గలదు. రెండవసారి ప్రయోగింపబడిన 'కరములు' అను పదమునకు ధన్యములైన కరములు లేదా సార్థకములైన కరములు అను తాత్పర్యభేదము గల్గును.

ఉదా॥ శేషశాయికి మ్రొక్కు శిరము శిరము.

ఇట 'శిరము' అను పదము శబ్దమునందు అర్థము నందు భేదము లేక అవృత్తి నొందినది. అయినను విష్ణువునకు మ్రొక్కు శిరమే ప్రశస్తమైన శిరమని తాత్పర్యభేదము గలదు.

3. ఛేకానుప్రాసము:- అర్థభేదముతో రెండేసి హల్లులు వ్యవధానము లేకుండా ఒకసారికంటె ఎక్కువగా అవృత్తి యగుట. ఛేకుడన విదగ్ధుడు. విదగ్ధులగువారు వ్యవహరించు అనుప్రాసము ఛేకానుప్రాసము. ఇట రెండు అక్షరములు నియమముగా పునరుక్తి చెందును.

ఉదా॥ భీమ భీమ పరాక్రముడు, సదా సదాగమంతుడు.

సమన్వయము:- ఇట 'భీమ' అను ఒకే శబ్దము వెంట వెంటనే రెండుమార్లు అవృత్తియైనది. ఇందు శబ్ద భేదము లేకున్నను అర్థభేదము గలదు. మొదటి పదమగు 'భీమ' అనుదానికి 'భయంకరమైన' అని అర్థము. రెండవ పదమగు 'భీమ' అనుదానికి భీముడని అర్థము.

అటులనే 'సదా' అను పదము రెండుమార్లు అవ్యవహితముగ వచ్చినది. మొదటి పదమగు సదా అనుదానికి ఎల్లప్పుడు అని అర్థము. రెండవ పదమగు సదాగమంతుడనుదానికి అతిథుల నాదరించువాడని అర్థము.

ఉదా॥ కందర్ప దర్పములగు సుందర దరహాస రుచులు.

ఇందు మొదటి 'దర్ప' అనునది మన్మథుని నామమగు కందర్పలోనిది. రెండవ 'దర్ప'కు అర్థము గర్వము. శబ్దభేదము లేదు, అర్థభేదము గల్గినది. మొదటి 'దర' అనునది సుందరలోనిది, సౌందర్యమని భావము. రెండవ 'దర' అనునది 'దరహాస' అను పదములోనిది. చిఱునవ్వు అని భావము. ఇట 'దర' అను ఒకే పదము లేక రెండు అక్షరములు వెంట వెంటనే అర్థభేదముతో అవృత్తియైనవి.

4. **యమకము:** సమానమైన వర్ణములయొక్క జంటగాని సమూహముగాని అవృత్తి యగుట. లేదా, అర్థభేదముతో ఒకేమాట మాటిమాటికీ ప్రయోగింపబడుట.

అనగా ఒకే విధమైన క్రమముతో సమానమైన అర్థము నీయని సమానమైన వర్ణముల జంటగాని లేదా పెక్కు వర్ణములుగాని మరల మరల వచ్చుట.

*ఉదా॥ లేమా దనుజుల గెలువగ*
*లేమా నీవేల కడగి లేచితి విటురా*
*లే మాను మానవానా*
*లే మా విల్లందికొనుము లీలన్ కేలన్.*

ఇందు మొదటి 'లేమా' అను పదమునకు 'స్త్రీ' అని అర్థము. రెండవ 'లేమా' అను పదమునకు జాలమా (గెలువజాలమా) అని అర్థము. మూడవ 'లేమా' అను పదము ఇటులే, మాను అను నర్థము నందు గలదు నాల్గవ 'లేమా' అను పదము 'ఔను లేమా' అను నర్థమున గలదు.

ఉదా॥ సైనిక నికాయంబులో కాయంబు గాయంబు లేనివాడు లేడయ్యె.

మొదటి 'కాయంబు' అను పదము నికాయము అను పదములో గలదు. నికాయమన సమూహము. రెండవ 'కాయంబు' అను పదమునకు శరీరమని అర్థము.

5. **ముక్తపదగ్రస్తము:-** పదాంతమున విడిచిపెట్టబడిన పదమును ఆ తరువాత పాదము అదిని గ్రహించి చెప్పుట. లేదా వదిలివేయబడిన పదాన్ని మరల గ్రహించుట.

*ఉదా॥ సుదతీ నూతన మదనా*
*మదనా గతురంగ పూర్ణమణిమయ సదనా*
*సదనా మయ గజరదనా*
*రదనాగేంద్ర నిభకీర్తిరస నరసింహా!*

ఇందు మదనా అను పదముతో మొదటి పాదము అంతమైనది. మరల మదనా అను పదమునే గ్రహించి రెండవ పాదము మొదలయినది. అటులనే సదనా, రదనా అను పదములను పదాంతములనుండి గ్రహింపబడి పదాదిని చేరినవి.

వృత్త్యనుప్రాసమునందు హల్లు ఆవృత్తియగుటయే ముఖ్యము. అచ్చులు, సామ్యము ప్రధానముగాదు. ఛేకానుప్రాసమునందు అక్షర సంఖ్యా నియమము గలదు. అనగా రెండే అక్షరము లుండవలయును. అవియును అవ్యవధానముగా (వేరుకాకుండ ఒకదానివెంట మరొకటి) ఉండవలెను. యమకమునందు సమాన వర్ణముల సమూహము ప్రక్క ప్రక్కనే ఉండవలయినను నియమము లేదు. పద్యపాదములలో నెచ టనైనను ఉండవచ్చును. యమకమునందు అచ్చులలోను, హల్లులలోను భేదముండరాదు. అచ్చులతోడి ఆవృత్తి ఇందు ముఖ్యము. ఛేకానుప్రాసము నందు అచ్చుల ఆవృత్తి ముఖ్యముగాదు, హల్లుల ఆవృత్తియే ముఖ్యము.

## అర్థాలంకారములు

అర్థశోభను కల్గించునవి అర్థాలంకారములు. శబ్దము నపేక్షింపక యర్థము మాత్రము నాశ్రయించిన అర్థాలంకారము. లేదా ఒక వస్తువును వేరొక వస్తువుతో అందముగా పోల్చుట.

1. **ఉపమాలంకారము:-** ఉపమానమునకు ఉపమేయమునకు కవి సమయసిద్ధమగు సామ్యమును తెల్పుట.

**వివరణము:-** ఉపమేయము యొక్క గుణాదులనుబట్టి దానిని అవే గుణాదులను గల్గియున్నట్టి ఉపమానముతో పోల్చుట.

ఉపమానము = పోల్చు వస్తువు (దేనితో పోల్చుదుమో ఆ వస్తువు)

ఉపమేయము = వర్ణింపబడు వస్తువు.

సమానధర్మము = ఉపమానమునందు, ఉపమేయమునందు సమా నముగానుండు గుణము లేక ధర్మము.

ఉపమావాచకములు = సామ్యమును లేక పోలికను తెలుపు పదములు. ఉపమను వచించు పదము ఉపమావాచకము. ఉపమాలంకారములందు సాధారణముగ నీ పదములు కన్పించును.

ఉదా॥ వలె, పోలె, రీతి, పగిది, వంటి, అట్లు, చందము, భంగి, మాడ్కి, మాదిరి, సమాసము, తుల్యము, కైవడి, విధము మున్నగునవి.

ఈ ఉపమాలంకారము రెండు రకములు.

i) పూర్ణోపమ ii) లుప్తోపమ.

i) **పూర్ణోపమ:** అనగా ఉపమేయము, ఉపమానము, ఉపమావాచకము, సమాన ధర్మము నాల్గును గల్గియుండుట.

ఉదా॥ సంగీతము అమృతమువలె మధురముగ నున్నది.

ఇందు ఉపమేయము సంగీతము.

ఉపమానము అమృతము

సమాన ధర్మము మాధుర్యము

ఉపమావాచకము - వలె.

ii) **లుప్తోపమ:** ఇందు ఉపమాలంకార అంశములలో ఏదియో ఒకటి లోపించును.

ఉదా॥ మీనములవంటి కనులు

ఇందులో సమాన ధర్మము లోపించినది.

2. **ఉత్ప్రేక్షాలంకారము:-** జాతి, గుణ, క్రియాధర్మముల సామ్యముచేత ఉపమేయమును ఉపమానముగా ఊహించి చెప్పుట. లేదా ఉపమేయమును ఉపమానముగా ఊహించుట.

**వివరణము:-** ఉపమానముయొక్క ధర్మమునుబట్టి ఉపమేయ వస్తువు (వర్ణింపబడువస్తువు)ను ఉపమానము (పోల్చువస్తువు)గా భావించుట.

ఇది ముఖ్యముగా మూడు రకములు:

i) వస్తూత్ప్రేక్ష ii) హేతూత్ప్రేక్ష iii) ఫలోత్ప్రేక్ష

i) **వస్తూత్ప్రేక్ష:** ప్రస్తుత వస్తువును తదన్య వస్తుస్వరూపముగా భావించుట.

ఉదా॥ ఈ చీకటి చక్రవాక పక్షుల విరహాగ్ని ధూమమా అనునట్లు ఉండెను.

**వివరణము:-** 'చీకటి' ప్రస్తుత వస్తువు. చక్రవాకపక్షుల విరహాగ్ని ధూమము తదన్యవస్తువు. చీకటి ఉపమేయము. ధూమము ఉపమానము. ధూమముయొక్క స్వరూపముగా చీకటి ఊహింపబడినది. ఉపమానమైన ధూమముయొక్క గుణక్రియలను అనగా నల్లగా నుండుట, అంతట వ్యాపించుట అను లక్షణములు చీకటికి గలవు. అందుచేత చీకటి ధూమముగా ఊహింపబడినది.

ii) **హేతూత్ప్రేక్ష:-** హేతువుకానిదానిని హేతువుగా ఊహించుట.

ఉదా॥ చెలీ, నీ మృదుపదములు భూమిని తాకుటచేతనేమోయనునట్లు అరుణములై ఉన్నవి.

**వివరణము:-** చరణములు సహజముగా అరుణవర్ణములో నున్నవి. నేలపై నడచుటచే కాదు. అయినను అరుణత్వమునకు హేతువు భూమిని తాకుట యని ఊహింపబడినది.

iii) **ఫలోత్ప్రేక్ష:-** ఫలము కానిదానిని ఫలముగా భావించుట.

ఉదా॥ యువతీ! నీ పదములలో ఐక్యమొందుటకు పద్మము నీటియందు తపము చేయుచున్నది.

**సమన్వయము:** పద్మమునకు జలావాసము సహజముగా నున్నది. కాని వనితాపదములందు ఐక్యమొందుటకు తపము చేయుటలేదు. అయినను ఆ తపమునకు ఫలము పదములలో లీనమగుట అని ఊహింపబడినది. ఈ అలంకారములందు ఏమో–ఓ–ఎంచెద–నాన్–అనునట్లు, అనగాన్ అను పదములు సాధారణముగా కన్పించును.

3. **రూపకము:-** ఉపమాన ఉపమేయములకు అభేదమునుగాని లేదా ఆరోపణమునుగాని చెప్పుట.

**వివరణము:-** ఉపమానముయొక్క ధర్మమును హృదయరంజకముగా ఉపమేయమునందు ఆరోపించుట. అనగా ఉపమానము ఉపమేయము ఒకటే అని చెప్పుట.

ఉదా॥ ఆమె శరీర లతిక మిక్కిలి లావణ్యముగ నున్నది. (శరీరము అనెడి తీగ.)

**సమన్వయము:-** ఇట శరీరమునకు తీగకు అభేదము చెప్పబడినది. అనగా భేదము లేదని చెప్పబడినది. దీనికి కారణము ఉపమానమగు లతకుగల సౌకుమార్యము, సౌందర్యము, లావణ్యత శరీరమునకును కలుగుటయే. అందులకే శరీరము, తీగ ఒకటే అని చెప్పబడినవి.

ఇందు అర్థము చెప్పకొనునప్పుడు 'అనెడి' అను పదము వచ్చును.

4. **అర్థాంతరన్యాసము:-** విశేషమును సామాన్యముచేగాని సామాన్యమును విశేషముచేగాని సమర్థించుట.

**వివరణము:-** ఒక విషయమును సమర్థించుటకై మరియొక విషయమును సమర్థించుట. ఒక విశేష విషయమును చెప్పి దానిని లోకప్రసిద్ధమగు ధర్మముతోగాని లేదా ఒక లోకోక్తితోగాని సమర్థించుట.

అటులనే సామాన్యముగు లోక ధర్మమును చెప్పి, దానిని మరొక ప్రత్యేక విషయముతో సమర్థించుట.

విశేషమును సామాన్యముతో సమర్థించుట.

ఉదా॥ సత్యభామ శ్రీకృష్ణుని శిరస్సును కాలితో తొలగద్రోచెను. 'పేరలకనుచెందినట్టి కాంతలు ఉచిత వ్యాపారములు నేర్తురా?' (నేర్వరు).

సమన్వయము:- శ్రీకృష్ణుని శిరస్సు దేవతలకు కూడా పూజార్హ మైనది. మన్మథునివంటి సుకుమారునికి తండ్రి శ్రీకృష్ణుడు. అంతటి సౌందర్యము, ఔన్నత్యము గల భగవానుని శిరము కాలితో తన్నుట విశేష విషయము. అయినను లోకమునందలి స్త్రీలు తమ భర్తలపై మిక్కిలి కోపించినప్పుడు ఉచితము, అనుచితము అను విచక్షణ లేకుండ ప్రవర్తించుట సామాన్య విషయము.

సామాన్యమును విశేషముచే సమర్థించుట.

ఉదా॥ గుణవంతుల సంపర్కముచే అల్పవస్తువు కూడ గౌరవము నందుచున్నది. పూలతో గూడిన దారము శిరస్సున ధరియింపబడుచున్నది.

సమన్వయము:- సజ్జనులయొక్క సాంగత్యముచేత అల్పులైన మాన వులకును సంఘమునందు ఆదరణ గౌరవము లభించుచుండుట లోక సామాన్యము. దారమును ప్రత్యేకించి ఎవరును శిరస్సున ధరింపరు. కాని, ఆ దారముతో పూలను అల్లుటచే పూలతోపాటు దానిని శిరస్సున ధరించుదురు. ఇట దారము శిరస్సున ధరించుట అనునది విశేష విషయము. దానికి కారణము దారమునకు పూలతోడి సాంగత్యమే.

5. **అతిశయోక్తి:-** సంబంధము లేనిదే ఉన్నట్లు చెప్పినను, ఉపమేయ మును కప్పిపుచ్చి ఉపమానమును మాత్రమే చెప్పినను అతిశయోక్తి అలంకారమగును.

**వివరణము:-** ఒక వస్తువుయొక్క యదార్థస్థితి నతిక్రమించి దాని నధికవర్ణన గావించినను లేదా ఉపమేయమును మరుగుపరచి ఉపమానమును అతిశయముగ వర్ణించినను అతిశయోక్తియగును.

ఉదా॥ ఈ పురమందలి సౌధాగ్రములు చంద్రుని తాకుచున్నవి.

సమన్వయము:- సౌధములు మిక్కిలి ఎత్తుగ నున్నవి. అయినను వాని అగ్రములు ఆకసమునందున్న చంద్రుని తాకలేవు. ఏలనన, ఎంత ఎత్తు మేడలైనను ఆకసములోనికి చొచ్చుకొనిపోజాలవు.

ఇట మేడల అగ్రభాగములకు, చంద్రునికి ఎటువంటి స్పర్శయు కలయికయు లేదు. అయినను లేని సంబంధమును ఉన్నట్లు అధిక వర్ణన గావించి చెప్పినందున ఇది అతిశయోక్తి అలంకారము.

ఉదా॥ నల్ల కలువల జంటనుండి వాడియైన బాణములు వెలువడుచున్నవి.

**సమన్వయము:** ఇందు ఉపమానములగు నల్ల కలువల జంట, వాడి బాణములు మాత్రమే స్వీకరింపబడినవి. ఉపమేయములగు యువతీ నేత్రద్వయము, కలికిచూపులు మరుగునపడినవి. అనగా ఉపమానములను బట్టియే ఉపమేయమును గ్రహింపవలయును.

6. **స్వభావోక్తి:**- జాతి గుణాదుల యందున్న స్వభావమును సహజముగా వర్ణించుట.

**వివరణము:**- ఒక వస్తువునకు స్వభావసిద్ధముగానున్న స్థితిని, యదార్థమైన ధర్మమును రమణీయముగా వర్ణించుట. ఇందు సూక్ష్మదృష్టికి కాని స్ఫురించనటువంటి విషయవర్ణన ఉండవలెను.

*ఉదా॥ తొలికోడి కనువిచ్చి నిలిచిమై వెంచి*
*జలజల ఱెక్కల సడలించి నీల్గి*
*క్రిక్కనఁ గాలార్చి కంఠంబు విచ్చి*
*ముక్కున నీఁకెలు చక్కొల్పి...*

**సమన్వయము:** ఇట తొలికోడి కూతకూయుటకు ముందు నిద్రలేచి కనులు బాగుగా విచ్చి చూచి, శరీరము విఱిచికొని ఱెక్కలు సడలించుట, కంఠమెత్తుట మున్నగునవి స్వభావసిద్ధముగానున్నవానిని కవి సూక్ష్మపరిశీలన గావించి వర్ణించెను.

7. **శ్లేష:**- నానార్థ సంశ్రయము శ్లేష లేదా అనేకార్థములు గల చమత్కారవాక్యము.

**వివరణము:**- అనేకములగు అర్థములతో గూడిన శబ్దములయొక్క కూర్పు లేక కూడిక.

**ఉదా॥ రాజు కువలయానందకరుడు.**

**సమన్వయము:** ఇట రాజు అను పదమునకు ప్రభువు అనియు చంద్రుడు అనియు రెండర్థములు. అటులనే కువలయము అనగా భూమి అనియు, కలువ అనియు అర్థములు గలవు. ఇట భూపాలుడు

భూమికి ఆనందము గల్గించుననియు, చంద్రుడు కలువలకు ఆనందము కల్గించుననియు రెండర్థములు గలవు.

ఉదా॥ ఆ యువతి అబ్జసుందరముఖి, ప్రవాళాధరోష్ఠ, కాంచనాభాంగి.

సమన్వయము:- ఆ స్త్రీ పద్మమువంటి సుందర వదనము గలది అనియు, పగడమువంటి పెదవిగలది అనియు, బంగారమువంటి దేహము గలదనియు అర్థము.

మరియొక అర్థమును చూచిన అబ్జము అనగా పద్మమేకాక చంద్రుడనియు అర్థము గలదు. ప్రవాళమునకు పగడమనియేగాక చిగురు అనియు, కాంచనమునకు బంగారమనియే గాక సంపెంగపూవు అనియు అర్థములు గలవు. కావున చంద్రునివలె సుందర వదనము గలదనియు, చిగురువంటి పెదవి గలదనియు, సంపెంగపూల సౌరభము వంటి పరిమళ భరితమైన దేహము గలదనియు మరొక అర్థము చెప్పవచ్చును.

★ ★ ★

# వర్ణదోషములు

1. యకారమును, వు, వూ, వొ, వోలు తెలుగు పదములకు మొదట ఉండవు.

| తప్పు | ఒప్పు |
|---|---|
| యెవరు | ఎవరు |
| యెందుకు | ఎందుకు |
| వూరు | ఊరు |
| వోడ | ఓడ |
| వుండుట | ఉండుట |
| వొకటి | ఒకటి |

2. శ, ష, స–లు ఒకదాని కొకటి వ్రాయుదురు.

| తప్పు | ఒప్పు |
|---|---|
| శెలవు | సెలవు |
| ఇష్టము | ఇష్టము |
| కస్టము | కష్టము |

3. ఋకార రేఫముల వత్తులు (ృ, ్ర) వ్రాయుటలో ఒకదానికింకొకటి వ్రాయుట.

| తప్పు | ఒప్పు |
|---|---|
| దృతము | ద్రుతము |
| ప్రక్రుతి | ప్రకృతి |
| అద్రుష్టము | అదృష్టము |
| శతృవు | శత్రువు |

4. ధ–థ లు ఒకదానికొకటి వ్రాయరాదు.

| తప్పు | ఒప్పు |
|---|---|
| కధ | కథ |
| గ్రంధము | గ్రంథము |
| అతిది | అతిథి |

5. ట–ఠ లలో భేదము పరిశీలింపవలెను.

| తప్పు | ఒప్పు |
|---|---|
| నిష్టురము | నిష్ఠురము |
| జ్యేష్ట | జ్యేష్ఠ |
| పృష్ఠి | పృష్టి |

6. ఒత్తులను తారుమారు చేయుట.

| తప్పు | ఒప్పు |
|---|---|
| భాద | బాధ |
| బేధము | భేదము |
| భోద | బోధ |
| లాబము | లాభము |

★ ★ ★